# హెచ్చరిక.

లిఖితరూపకమగు నాయనుమతిని బొందక యెవ్వరు నీనాటకముఁ బ్రదర్శింపఁ గూడదు.

గ్రంథకర్త,

ముత్తనేని వేంకట చిన్న కేశవులు,

జగ్గయ్యపేట.

# ప్రకటన.

ఈప్రథమ ముద్రణము 1000 ప్రతులలోఁ బ్రతిపుస్తకము మీఁదను నా సంతకముండును, అట్టి సంతకము లేని పుస్తకము కనపఱిచినవారికి బహుమతి యొసంగఁబడును.

మద్దాల శ్రీరంగము,

జగ్గయ్యపేట.

# పాత్రలు.



**పురుషులు.**

పరమేశ్వరుఁడు
హిమవంతుఁడు
నారదుఁడు
మన్మథుఁడు
ఇంద్రుఁడు
బ్రహ్మ
భీషణుఁడు
జంబుకాస్యుఁడు
భగీరథుఁడు
సూర్యుఁడు
చంద్రుఁడు
రాహువు
కేతువు
శివశర్మ
విఘ్ననాథుఁడు
కుమారుఁడు

**స్త్రీలు.**

పార్వతి—మీనాక్షి
మేనక
గంగాదేవి—గుణవతి
శశిముఖి
రతీదేవి
సర్వమంగళ
మోహిని

 పదుగురిలోఁ బ్రదర్శింప వచ్చును.

# నాంది.

"ఏలసృజింపఁ? నేలభరి । యింపఁగ? నేలహరింప నీజగ
జ్జాలము?" నంచుఁ దన్నడుగు । శైలజకున్ శివుఁ డప్రహాస్యమున్
బోలవచింపు పోల్కిఁ బస । పాంతకుఁ బిల్చి నెలంత చెక్కిలిన్
లీలను ముద్దుగొనినగు । లే నెలతాలుపు మిమ్ము నేలుతన్

శ్రీ

శివాయ గురవే నమః

# శివలీల.

## ప్రథమాంకము.

### ప్రథమ రంగము.

ప్రదేశము—ఓషధిప్రస్థమున నుద్యానము.

ప్రవేశము—మేనకా హిమవంతులు పార్వతి.

హిమ—దేవీ! మేనకా! విలోకింపు మీపారిజాతవల్లి చిగురున ముకుళ మెంత మనోహరముగ విలసిల్లినదో? ఇది మన ముద్దుబిడ్డ యరుణాధరంబునఁ జిఱునగ వుదయించిన తెఱంగు ననుకరించుచున్నది.

మేన—ఆర్యపుత్త్రా! బాగుగాఁ జెప్పితిరి.

పార్వ—(అపవారించి) అమ్మా! దీనిఁ జూచితివా? యీమందార లతామతల్లి మధుమాస సమయసంపర్కమునఁ బుష్పవతియై పరిణయార్హయై పరిఢవిల్లుచున్నది.

మేన—నీవలె నఁటమ్మా!

పార్వ—(లజ్జ నభినయించుచున్నది)

మేన—ప్రాణనాథా! ఈపుత్త్రికారత్న మేమహనీయునిచే ధరింపఁబడ నున్నదో?

హిమ—దేవీ!

గీ. వస్తువున కర్హమైన తావలమె యెపుడు
సృష్టిలోన నీశుఁ డనుగ్రహించుచుండు

నారదుఁడు కచ్ఛపియను గానాంబికను మీటుచు, చంద్ర
రేఖ నిలయుఁగాంగు ధరించి పాడుచు

(నేపథ్యమున గానము)

పార్వ—(ఆత్మగతము) మహాదేవస్తోత్రసుధారసపూరము మధుర గానాలాపము!

హిమ—దేవీ! మన మేపూర్వధర్మఫలమో సర్వగణ్యుఁడు పద్మసంభవ మానస పుత్త్రుఁడు నారదుఁడు విచ్చేయుచున్నాఁడు.

(1. అనుబంధము నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మేన / హిమ —బ్రహ్మర్షిచంద్రా! నమస్కారము.

నార—కల్యాణమస్తు.

పార్వ—మునీంద్రా! నమస్కారము.

నార—తల్లీ! ముల్లోకంబులఁ దులలేని వరునిఁ బడయుము.

హిమ—స్వామీ! ఈపీఠము నలంకరింపుఁడు.

నార—ఓ మేనకా హిమవంతులారా! మీరు గదా సార్థక జన్ములు? ఈజగన్మాతనిఁ బుత్త్రిగాఁ బడసితిరి.

గీ. ఎల్లజీవకోటులఁగన్న తల్లి యీమె
యీమె తల్లి పైనెతి సాకే స్త్రీమతల్లి
అంధకాసురు హరుఁడు లోకైక గురుఁడు
హరున కీవు గురుఁడవయ్యె నద్రిరాజ!

హిమ—మహానుభావా! హరునకు నేను గురుండ నగుట యేమి?

నార—నగేంద్ర! విశ్వచతుర్దశభువనవల్లభుఁడు నీకల్లుఁడుగాఁగలఁడు

హిమ—ఆహా! ఇది సత్యమా?

నార—సత్యము. ముమ్మాటికి సత్యము. ఓ పుణ్యదంపతులారా! ఇటు వినుఁడు.

మేన, హిమ—అహా! యేమి మాభాగ్యము?

పార్వ—(ఆత్మ) అహా! కన్ను లున్నందులకు ఫలము నేఁడు గదా కంటిని.

గీ. దర్శనం బీయకయె నన్నుఁ దనదు చరణ
కింకరిం జేసికొన్న యే శాంకమకుటుఁ
డాకృతింగన్న మద్భాగ్య మట్టి దనుగొ!
నన్నుఁ గరుణింప నేతెంచు చున్నవాఁడు

(ప్రవేశము—పరమేశ్వరుఁడు)

(మేనకా హిమవంతులు నారదుఁడు నమస్కరింతురు)

పర—శుభమగుఁ గాక!

హిమ—(పరమేశ్వరుని పీఠమునఁ గూర్చుండఁజేసి) అమ్మా! అపర్ణా! జగద్వల్లభునకు నమస్కరింపుము.

పార్వ—(లజ్జాభయసంభ్రమములతో నమస్కరించుచున్నది)

పర—కన్యారత్నమా! నీయిచ్చకు వచ్చినవాని కిల్లాలవయ్యెదవుగాక. ఓ తుహినభూధరేంద్ర!

గీ. ప్రాణవల్లభావిరహాత పమునఁ బడలు
నాదు నొడలు తుషార సంఘాత శతశి
లాతలంబు నీసానుత లంబునందుఁ
జల్లపఱచుకొనవచ్చితి క్ష్మాధరేంద్ర!

నాకుఁ దపము సేసికొనుటకుఁ దగిన తావు దయసేయుము.

హిమ—మహాప్రభూ! ఇదియేమి? నీచరణసేవకులలో నొక్కరుఁడఁ గానా యేను? నాసకలైశ్వర్యములు నీయవిగావా? ఆజ్ఞసేయ వలసిన నీవు నన్నర్థించుట యేమి?

మ. ననునర్థింతె తపస్స్థలంబుఁ? ద్రిజగన్నాథుండవో నీవొసం
గినదే కాదె సమస్తమాశ్రితుని భక్తిన్ మెచ్చిము? న్నింతలో

ననిమక దాతను నేతనేమతి కృత । ఘ్నత్వంబు వాటింతునే?
అనఘా! నీవయి యాజ్ఞసేయునెడ మ । త్ప్రాణంబు నర్పింపనే?

ఇదియటుండ నో మహానుభావ!

గీ. నను దరింపఁజేయు । నను గృతార్థునిఁజేయు
నరుగు దెంచినాఁడ । వయ్య నీవు
గాకయున్న సకల । లోకేశునకు నీకుఁ
దావె దొరకకున్నె । తప మొనర్ప?

సర్వేశ్వరా! నీకుఁదగిన తపస్స్థాన మిప్పుడే యేర్పరింతును. మఱియు నీకుఁ బ్రత్యహమ్మును నిధ్మ కుశపల్లవాదులను సమకూర్పుటకును వేదికా సమ్మార్జ విధుల నిర్వర్తించుటకును నీచరణ కింకరి నాముద్దుకూఁతురు నపర్ణ నియోగించుచుంటిని. అనుగ్రహించి యంగీకరింప వలయును.

పర — కాంతారత్నము తపశ్చర్యకు విఘ్నకారణము గాదా? (ఆలోచించుట నభినయించి) అంగీకరించితిని.

మేనకా
హిమ } — అనుగ్రహింపఁ బడితిమి.

పార్వ — (ఆత్మ) ధన్యురాల నయితిని.

హిమ — సకలేశ్వరా! నేనిక్షణముననే నాసతీసుతలతో నేఁగి నీకుఁ దపస్స్థల మేర్పఱించి వత్తును సెలవొసంగుము.

పర — మంచిది.

హిమ — దేవీ! పోవుదము రండు. (మేనకా హిమవంతులు పార్వతి నిష్క్ర)

నార — మహాదేవ! తావక విచిత్ర లీలాగ్రంథమున కర్థము నీవే వ్రాయ వలయును జుమా?

పర — నారదా! యేమి?

నార — స్వామీ! ప్రాణవల్లభా విరహాతపమున బడలిన నీశరీరముఁ జల్లపఱచుకొన నిచ్చటకు వచ్చితి నంటివి. ప్రాణవల్లభ యిచ్చట నున్నదనియే కాదా? సతిని బరిగ్రహించి గృహస్థుఁడవుగా నెంచిన యనురాగికి యోగికిఁ బలెఁ దపశ్చర్య లెందులకు? ప్రపంచమున నందఱు మొదట గృహస్థులై పిమ్మట సన్న్యాసులయ్యెదరు. నీవు మొదట సన్న్యాసివై పిమ్మట గృహస్థుఁడవు గా నెంచితివా? తపస్సిద్ధి గలిగినఁగాని నీకభీష్టసిద్ధి గాదా యేమి? అదిగాక సకలయోగి జన తపఃఫల విధాతకు నీకుఁ దపమెందులకు? ఈశ్రమ మెందులకు?

సీ. అడుగరాదో యమ్మ ♦ దాత్మసంభవ నాకా
సంగుండటంచు నీ ♦ జంపతులను?
ఈవవైమె యడిగిన ♦ నీరె సర్వాత్మ! నీ
వెఱుఁగవే వీరల ♦ హృదయవృత్తి?
భిక్షింపవలెనన్న ♦ బిడియమా? యాదిమ
భిక్షున కిది క్రొత్త ♦ విద్దెయగునె?
ప్రకృతి పురుషు లీరు ♦ పడఁతిఁ జేపట్టక
పోవు! సగముగాక ♦ పోవెఱుఁగుదు!

గీ. ప్రకృతిపురుషసంబంధమ్ము ♦ నాసిపోదు
శాశ్వతం, బీ విచిత్రంపు ♦ విశ్వనాట
కమున నింక నంతర్నాట ♦ కంబు లేల?
కాలయాపన మిదియేల ♦ కాలకాల!

పర — విరించి మనస్సంభవా? ముందు ముందు కారణ మెఱుంగఁ గలవు.

నార — ఇంతకు ముందు నీచేతలకు గతం బెఱింగితినిగాన నికముందు నీలీలలకుఁ గారణ మెఱుంగఁ గలుగుదునని విశ్వసింతునా?

అది యడియాస యని నేనెఱుంగుదును. ఇప్పటి నీచేఁతకు నను బోటులు గ్రహించు నర్థమిదిగో! మనవి సేసికొనుచుంటిని.

గీ. కొంగ తపమువోలెఁ దొంగతపము సేసి
కొన్నినాళ్లు గడపి కుధరపుత్త్రి
హృదయపేటి నపహరింపవేసిన వేస
మిదియటంచు నెంతు రింతె మేము॥

(పునఃప్రవేశము మేనకా హిమవంతులు పార్వతి)

హిమ—చంద్రశేఖరా! తపస్స్థానమునకుఁ బోవుదము రండు.

పర— మంచిది

(అందఱు నిష్క్రమింతురు).

## ద్వితీయరంగము.

ప్రదేశము—హిమవత్పర్వతమున నొక బయలు.

ప్రవేశము—మన్మథుఁడు.

### 2. అనుబంధము.

మన్మ—(ప్రక్కకుఁజూచి) ఓహో! నా ప్రాణసఖుఁడు వసంతుఁడప్పుడే తుహినకుధరసానువనాంతరభూములఁ బ్రవేశించి జగద్ధితార్థ సంసిద్ధికై స్వప్రతాపము సూపుచున్నాఁడు. వృక్షములు నికుంజము లొక్కసారిగఁ బుష్పితములైనవి. షట్పద కోకిల రాజకీరాది మధుమాస రాజభటబృందమ్ములు మధురగాన సింహనాదములు గావించుచున్నవి. నేనును హరసాన్నిధ్యమున కరిగి యమరకార్యము నిర్వర్తించెదఁ గాక. [పరిక్రమించుచున్నాఁడు]

రతి—[వెనుకనుండి ప్రవేశించి] ప్రాణనాథా!

మన్మ—ఆఁ! ఇది యేమి? రతీ! నీవిచ్చట కెందులకు వచ్చితివి?

రతీ—ఆర్యపుత్రా! నీవు ఘోరఫణీంద్రఫణారత్నముం గొనఁ బ్రయత్నించువాని విధమున మహాదేవ తపోభంగకార్యమునకు నరుగుచుంటివని నారదగర్భసంభవుఁడు వచింప విని పాదమ్ములఁ బడి ప్రార్థించినైన నిన్నీ యనార్యకార్యమునుండి మరల్పవలయునని పరుగెత్తుకొని వచ్చితిని. వలదు. నాథా! ఆప్రయత్నము వలదు.

మన్మ—దేవీ! ఆనారదుండు వాకొనినంతమాత్రమున నేననార్యకార్యోద్యుక్తుండనైతినని నీవు విశ్వసించితివా? వినుము. ప్రకృతిపురుషాత్మకంబులును విశ్వజగన్మాతృపితృస్వరూపంబులును, నగు జగదీశ్వర సవ్యాపసవ్య భాగంబులు నేఁ డొక కారణంబున వేఱైయుండుట నీవు నెఱుంగుదువుగదా? ఆభాగంబులందొకటి శంభురూపంబున తుహిన వసుంధరాధర సానుప్రదేశమున యోగసమాధి నవధరించుచున్నది. మఱియొకటి పార్వతీరూపంబునఁ దత్పరిచర్య సేయుచున్నది. ఆ మిథునంబున నైక్యంబు గావించుటయే నాసలుపఁబోవు కార్యము. ఆదంపతులకు జనించిన పుత్రద్వయంబువలన జగత్కంటకులగు తారకాసుర గజముఖాసురులు సంహరింపఁబడుదురు. ఇది జగద్ధితకార్యముగాని యనార్యకార్యమా?

రతీ—నాథా! ఇందు జగమ్మునకు హితమే గలుగవచ్చును. కాని మనకుమాత్ర మిందహితమే యున్నది.

మన్మ—ఎందుచేత.

రతీ—తల్లిపై వసంతమును జల్లినట్లు సకల చరాచర గురుని శరావిద్ధచేతస్కునిఁ గావించుట స్వామిద్రోహము గాదా? పరమేశ్వరునిపైఁ బ్రతాపముఁ బ్రదర్శించుటయా? శివాపరాధమునకవధి యున్నదా?

మన్మ—దేవి! ఇందు శివాపరాధ మేమున్నది. లోకహితము లోకే
    శ్వర హితముగాదా?

రతీ—అతని తపము సెఱచుట యతనికి హితమెట్లు గాఁగలదు!

మన్మ—విశ్వహితమే విశ్వేశ్వర హితము.

రతీ—ప్రాణేశ్వరా! ఆమహానుభావుఁ డుగ్రుఁడు. మఱి యనలాక్షుఁడు.

మన్మ—ఓయబలా! యెంతటి బేలవు?

గీ. అభవుఁ డుగ్రుఁడంచు నసలాక్షుఁ డంచుఁ ద
    త్కింకరుండ నేను జంక నేల?
    క్రూర మృగమటంచుఁ గొంకునే వ్యాఘ్రమ్ము
    నకుఁ దదర్భకంబు నలిన నయన!

రతీ—హృదయేశ్వర! వ్యాఘ్రము నిజార్భకమ్మును గూడ గ్రసించును
    గాదా?

మన్మ—మైకము వలనఁ గాదా?

రతీ—వియత్కచుఁడు గూడ యోగంపు మైకమున నున్నాఁడు గదా?

మన్మ—దేవీ! లోకనాయకునకు మైక మేమి?

రతీ—తపస్సమాధి నియతత్వము మాత్రమేమి? మనోహర! నీవు
    నుమ్మాటికి పోవలదు. నాకు బ్రహ్మశాపము జ్ఞప్తికివచ్చి
    భయము గలుగు చున్నది.

సీ. దైత్యుల కభవు న పత్యమునర్థి మృత్యు
        వెంచి యజుండు వి ధించుటయును
    ఆ క్రూర దానవు లదయులై యనయమ్ము
        మించి లోకముల బా ధించుటయును
    బహులతపోనియమైక ఫలవిఘాత హరుండు
        దాన తపంబును బూనుటయును

శివుని ధ్యానమ్ము మాన్పి ♦ జెఱచి కాముకుఁజెఱ్ఱి
మంచు నిన్నమరుల ♦ ఛ్రించుటయును.

గీ. మరులమాటలఁ గడునమ్మి ♦ బావిదుముకు
నోజ నీవందులకుఁ దల ♦ యూఁచుటయును
ఇన్నియుంజూడ విధిశాప ♦ మిట్టునిన్నుఁ
జెఱప నొనఁగూడెనో యంచు ♦ వెఱతునేను.

మన్మ—దేవీ! ఇంతకు నెఱవేఱని నీరజాసను శాపమున కిప్పుడు యోగము పట్టునని భయపడుచుంటివా? అది నెఱవేఱక తప్ప నిదైన నేఁడుగాకున్న రేపుమాత్రము నెఱవేఱదో? మృత్యుదేవతకు మనము భీతిల్లిన మృత్యుదేవత మనకు భీతిల్లునా? భువనహితకార్యమున మరణము గన్నవాఁడే గదా సార్థక జన్ముఁడు!

గీ. ఎవఁడు భువనోపకృతికి వ్య ♦ యించు నుసురు
వాఁడె మృతజీవి ధన్యుండు ♦ వాఁడె సుకృతి
భువనహితము నొనర్పకే ♦ యెవఁడు బ్రదుకు
వాఁడె నీచుండు జడుఁడు జీ ♦ వచ్ఛవంబు.

రతి—ప్రాణనాథా! "జీవన్ భద్రాణిపశ్యతి". యను శ్రుతివాక్యము గణింపనక్కఱలేదా? లోకహితమని తనకు నహితము గ్పూర్చుకొనఁ జనునా?

మన్మ—దేవీ! 'పరోపకారార్థమిదం శరీర' మను వాక్యముమాత్రము గణింపవలసినది గాదా? అదిగాక నేనిప్పుడు తిరిగిపోయినను నాకు మరణము దప్పదు. ఇచ్చినమాటఁ దప్పి మిన్న కేఁగిన-చోఁ గ్రతుభుజులూరకుందురా? భస్మమగునట్లు శపింతురు గాక. పిఱికితనమ్మునంజేసి తిరిగిపోయి బర్హిర్ముఖుల శాపాగ్నికింధనమ్మునగుటకన్న లోకోపకారకవ్యాపారమున జగదీశ్వరునిచేఁ జచ్చుట మేలుగాదా? మఱియు నో కాంతామణీ!

చ. అమరులయంతవారు నను నర్థివేఁడినవారు, సర్వలో
కములకు మేలు గూర్చునది కార్యము, సంస్పృహణీయవిక్రమ
క్రముఁడను నేను, ముందిడిన కాలు మరల్తునె? శాశ్వతంబు మా
నము సెడు నేనియుం గలికి నశ్వర మీ తనువేల కాల్పనే?

ఇంతకు సర్వజ్ఞుఁడగు చంద్రార్ధమకుటుండు మాత్ర మెఱుం గఁడా యిది విశ్వజగద్ధితకార్యమని, నేను నిజపదభృత్యులలో నొక్కరుఁడనని యెఱింగియు నామహానుభావుఁడు నన్నేల మట్టు వెట్టు? కావున నీవింక శంకదక్కి మన పురంబునకుఁ బొమ్ము.

రతీ—ప్రాణనాథా! నేను వెనుకకుఁ బోఁజాలను. మీవెనువెంట నరుగుదెంచి మీకుఁ గలుగఁబోవు శుభాశుభముల నేను బాల్గొందును.

మన్మ—మంచిది. ఆజగన్మాతృపితల నక్షిపర్వముగ నవలోకించి ధన్యు వయ్యెదవుగాని రమ్ము.

[నిష్క్రమించుచున్నారు.]

## తృతీయరంగము.

(ప్రదేశము—తపోవనము)

(ధ్యానసమాధి నిమగ్నుండై పరమేశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)
(ఒక ప్రక్కనుండి రతీమన్మథులు ప్రవేశించుచున్నారు.)

మన్మ—దేవీ! నీవిందునిలిచి చూచుచుండుము. నేనింక విశ్వహిత కార్యారంభకుఁడ నయ్యెదను. (పరిక్రమించి) ఓహో! వీఁడుగో! మనోవాచామగోచరుఁడు మహాదేవుఁడు! కుప్పసంబుననున్న ఘోరనాగేంద్రుని విధమ్మున యోగమగ్నుఁడై యున్నవాఁడు. ఈదేవదేవుని ధ్యానమునకు భంగము గలిగించినచో బోనునుండి వెలువడిన బెబ్బులియుంబోలె నాపైని బడునేమో! పైనిబడవలయునా? ఉన్నతావుననేయుండి సట

లనయనము నింతవిచ్చిచూచినఁ జాలదా ననుబోటులు మాఁడి బూడిదయగుటకు? ఆహా! నాకట్టి దుర్మరణమే కలుగఁగల దేమో? అక్కటా! మృత్యుముఖ గహ్వరమునకుఁబలె నా నిర్జరులు నన్నీకపాలిపాలి కేటికంపిరి. నీటిలోఁ దెఱుంగుటకుఁ బెఱవారిబిడ్డల దిగుఁడని చెప్పుట లోకమునన్నదే కదా? వారు పొమ్మనినంత మాత్రమున దుర్మతినై నేనేలరావలయు? కట కటా! నిరవధికభక్తిపరులకు జటిలపరులకైన నలభ్యుఁడగు నిటలాక్షుని లక్ష్యముసేసి నేనెటు బాణము విడుతు? వామాక్షి భుజచలనంబు లరిష్టమునే సూచించుచున్నవి

సీ. మృడునిపై బాణమ్ము విడిచిన యంతనే
  ప్రాణంబు విడువంగ వలయునేమొ?
పూవుఁదూపుల నేను బురహరు నేయన
  న్నగ్గిచూపుల హరుం డరయునెట్లు?
పాప వినోదార్థమై పూలఁదనుగొట్టఁ
  గత్తినిగొట్టునే కన్నతండ్రి!
ఇది జగద్ధితమంచు నెఱుఁగఁడే సర్వజ్ఞుఁ
  డెఱిఁగియే నను మడియించుఁగాక

గీ. ఎల్లలోకులకుఁ శుభం బెసఁగుచుండ
నేనొకఁడ గతించిన మాత్ర మేమిగోటు?
ఈతనుసాధనమ్ములు లోక హితముకొఱకు
వ్యయముసేయుట జననైక ఫలముగాదె?

(నేపథ్యము నవలోకించి)

ఆహా! సకలజనని శైలేంద్రనందన దేవకార్యము సఫలత నందించుటకదిగో నరుగుదెంచుచున్నది, నానీరసాశుగంబులకుఁ గాకున్న నీమహామోహార్ధాత్రి సరసకటాక్షాశుగంబులకైన స్థాణుఁడు చలింపక పోవునా? పరికించెదఁగాక,

(ప్రవేశము—పార్వతి, అక్షమాల్యముతోఁ గుసుమంబులతోఁడను)

వర—(కన్నులు దెఱచుచున్నాఁడు)

పార్వ—(నమస్కరించుచున్నది)

వర—అభిలషితవరప్రాప్తిరస్తు.

మన్మ—తథాస్తు. తథాస్తు. ఆహా! ఇదిగదా శివశక్తి సంయోగము నకుఁదగిన తరుణము. సంకల్పసంభవ మనస్సంకల్పము సమకూరదో?

గీ. అదిగో! సకలవిభుని ♦ పదపీఠమునయందుఁ
గుసుమములను బోసె ♦ బిసరుహాక్షి
ఇదిగో! నిటలనయను ♦ హృదయపీఠమునందుఁ
గుసుమబాణములను ♦ గూర్తు నేను.

(వింట బాణమును దొడుగఁబోయి కార్ముకమును శరమును విడిచిపెట్టుచున్నాఁడు)

రతి—మనోనాయకా! దుశ్శకునముఁ బరికించితివా? తిరిగిరమ్ము! నాథా! యింకనైనఁ దిరిగిరమ్ము.

మన్మ—(ఆత్మ) శరశరాసనపతనము నాపతనము నెఱింగించుచున్నది.

(నేపథ్యమున "మన్మథా! జగజ్జేయి! సంచలితస్వాంతుఁడవుగాకుము)

మన్మ—(ఆత్మగతము) ఆహా! దివ్యులు విమానారూఢులై నాప్రయత్నము నవలోకించుచు శరశరాసనమ్ములంబలె సాహసస్థైర్యంబుల నేను విడుతునేమోయని నన్ను నుందలించుచున్నారు. ఆహాహా! నాకార్యము గడతేఱినను లేక నేగడతేఱినను నాపైఁజల్లుటకు పారిజాత ప్రసూనంబుల దోయిలించుకొని గగనపథంబున నమరాంగనలు కట్టాయితంబై నిలిచి

యున్నారు. ఇందటియాస బుగ్గిసేయుటకన్న నేనొక్కఁడ బుగ్గినగుట మేలుగాదా ?

(ధనుర్బాణములందుకొనుచున్నాఁడు)

(పార్వతి యక్షమాల్యము పరమేశ్వరునకర్పింప సిద్ధపడుచున్నది. పరమేశర్వురుఁడు పాణిసాఁచి పరిగ్రహింపఁబోవుచుఁ బార్వతి వదనము నాదరముతోఁ జూచుచున్నాఁడు. పార్వతి లజ్జాభయ సంభ్రమములతో నక్షమాల్య మందించుచున్నది. మన్మథుఁడు వింట శరము సంధించుచున్నాఁడు.)

రతీ—ప్రాణనాథా! సాహసిక్యము వలదు. తిరిగి రమ్ము

(నేపథ్యమున) మీనకేతనా! భయపడకుము వెనుదీయకుము.

మన్మ—

చ. తిరుగుమటంచుఁ బల్కు సతి, కే దేవచయంబు వచించు ధైర్యముఁ
బరువిడిపోదునో? నిలిచి కే భస్మమయ్యాదునొ? యేమిసేయనో?
పరువిడి యుమ్మెతుంపరలఁ కే బందతనమ్మున మున్న నేటికిఁ
స్థిరమతి నిల్చి జూదెనయి కే దివ్యసుమ ప్రతతిఁ ముల్లింగెదఁ॥

(పరమేశ్వరునిపై బాణము విడువ సిద్ధపడుచున్నాఁడు)

పర—(మనోవికారము నభినయించి మన్మథుని దెసఁజూచి కోపముతో ఫాలనేత్రము దెఱచుచున్నాఁడు. మన్మథుఁడు భస్మమగుచున్నాఁడు, రతి మూర్ఛిల్లుచున్నది. పార్వతి నిర్విణ్ణయై నిలుచుచున్నది. (నేపథ్యమున) జయ దక్షయజ్ఞధ్వంసక ! జయ కామాంతక ! జయ.

(బ్రహ్మేంద్రాద్యమరులు మేనకా హిమవంతులు ప్రవేశము)

[3 అనుబంధము]

బ్రహ్మ—సర్వేశ్వరా ! యిందు మదను నపరాధ మేమియు లేదు. అస్మద త్తవరపరంపరా ప్రభావమ్మునంజేసి యప్రతీకప్రతా

పులై తారకవారణముఖాసురులు సకల లోకంబుల సంకటపఱచుచుండిరి. వారియిడుములు భరింపఁజాలక నీయపత్యంబున వారలకు మరణము విధింపఁబడియుండుటంజేసి శివశక్తి సంయోగముగావింప నేమందఱము కుసుమకోదండుని బ్రార్థించితిమి. మరుఁడు నిఖిలేశ్వరుఁడవగు నిన్ను శరావిద్ధచిత్తుని గావించినఁ దనకు మరణము దప్పదని శంకించియు లోకహిత కార్యమనియు మాప్రార్థన ద్రోసివేయనేరకయు నింతకు సాహసించె. భక్తాభయంకర! శంకరా! నిర్దోషియగు నించు విల్తుని సజీవునింగావించి రతీదేవికిఁ బతిభిక్ష పెట్టుము,

రతీ—తండ్రీ! నాకుఁ బతిభిక్ష పెట్టుము.

శివ—బ్రహ్మశాపప్రకారము కందర్పుఁడు రతికిమాత్రము సాంగుఁడై కనుపించుచు లోకంబుల ననంగుండై మెలంగుఁగాక.

మన్మ—(లేచును. రతిని జేరఁబోవును)

బ్రహ్మ—మహాదేవ! స్మరుని జీవింపఁజేసి దుఃఖసాగరనిమగ్నయగు రతీదేవి నుద్ధరించినట్లే తుషారకుధరతనూజం జేపట్టి తనయులం బడసి దుష్టదానవ భయాంభోనిధి నిమగ్నులమగు మమ్ముద్ధరింపుము.

శివ—పార్వతిం బెండ్లియాడుట కే నంగీకరించితిని.

బ్రహ్మ—హిమవంతుఁడా! శుభస్య శీఘ్రమ్. ఉత్సవాదులు పిమ్మట జరుపుదము. వరణదామము నీతనూజకొసంగుము.

హిమ—(వరణదామము పార్వతికొసంగుచున్నాఁడు)

బ్రహ్మ—జగజ్జనయిత్రీ! శైలపుత్రి! ఆవరణమాల్యము జగజ్జనకుని కంఠసీమ నలంకరింపుము.

పార్వ—(పూదండ మృడుని మెడను వేయుచున్నది)

(యవనిక జాఱును)

ఇది ప్రథమాంకము.



# శివలీల

## ద్వితీయాంకము.

### ప్రథమ రంగము.

ప్రదేశము—కైలాసపర్వత సానుస్థలము.

అనుబంధము 4.

(విఘ్ననాథుఁడు గంతులిడుచుఁ బ్రవేశించుచున్నాఁడు)

ప్రవేశము—ఇంద్రుఁడు.

ఇంద్రు—(ఆత్మగతము) ఆహా! మాతంగాస్యము మహాకాయము మౌంజీధరము మార్తాండకోటిప్రభాభాసమాన మీమూర్తియే కాఁబోలు ధరాధరాత్మజా ధర్మసంతానము? విశ్వేశ్వర నందనునకీ విఘ్ననాయకునకు నమస్కరించి నావచ్చినకార్యము విన్నవించెదఁగాక. (చేతులుమోడ్చి ప్రకా.)

గీ. ప్రకృతిపురుషులుపరికింపఁ బ్రణవచిత్ర
మిథమిథున రూపమునుధరియించికూడెఁ
ప్రభవమందినభర్త భంజనునకు,
వారణాస్యునకుఁ నమో వాకశతము.

విఘ్న—శుభమగుఁగాక. ఇంద్రా! దండాలకేమిగాని యుండ్రాళ్లేమైనఁ దెచ్చితివా? నాళికేరంపుబొండాలో! నవ్యదధిపిండఖండాలో?

ఇంద్రు—(ఆత్మగతము) ఇదియేమి? ఈమహాత్ముఁడు భోజనప్రియుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు! ఈతిండిపోతు భోజనమందిరమునకేగాని సంగరాంగణమునకు వచ్చునట్లు గన్పింపఁడే. ఇట్లని

చూచెద- (ప్ర) దేవ! మహానుభావ! దైత్యకోటులపై దాడి వెడలు సమరసైన్యంబుల కాధిపత్యము వహింప నిన్ను నీ యనుజుఁ గుమారస్వామిని దోడ్కొనిపోవుటకుఁ బరమేశ్వ రాజ్ఞంబడసి నేనిటకు వచ్చితిని.

విఘ్న— ఆసంగతిని నే నెఱుంగుదును. మఱి నీవిప్పుడు నన్నుఁగూర్చి పడిన దురూహాయు నెఱుంగుదును. నిన్ను క్షమించితిని. అది యటుండనీ! ఇటు విను,

గీ. అఖిలసత్క్రియారంభమ్ము లందుఁ భక్తి
నను సమర్చింపవలె, విఘ్ననాథు బాజ్ఞ
నిందు నేని మీకోర్కులు నిండఁగలవు
మందు నేని మీకోర్కులు మండఁగలవు.

ఇంద్రు— మహాత్మా! తమకుఁ గావలసిన పదార్థము లెన్నియైనఁ గొని తెచ్చుటకు నేను సిద్ధముగానున్నాఁడను.

విఘ్న— అమరేశ్వర! నాకుఁ గావలసినవన్నియు నీవెక్కడనుండి కొని రాఁగలవు. ఆయాశ వలదు.

గీ. కన్నతల్లిచేతి కబళమ్మునంబోలె
నెంత భక్తుఁ డిడిన నంతతోన
కనెదతృప్తి, నట్లు గాదేని నాబొజ్జ
నిండఁగలదె యెన్ని కొండ లిడిన?

నీవెంత పదార్థము గొనిరాఁగలవో యంత గొనిరమ్ము. మఱి యొక మాట—

గీ. ఎన్ని యుండ్రాలు నీవు నా కిడఁగఁగలవో
అరుల శిరము లన్నింటి నే నాజిరాల్తు
ఎంత పానక మీవు నా కిడఁగఁగలవో
అంత శత్రు రక్తమ్ము వా తింతు నేను.

ఇంద్రు—కొనివత్తును. తమ రిందే యుందురా?

విఘ్న—నీవెంటనే వత్తును. కాని మొదట నీవు సేయువలసినది నా భోజన ప్రయత్నము. పిమ్మట యుద్ధప్రయత్నము.

ఇంద్రు—చిత్తము. దయసేయుఁడు.

[నిష్క్రమింతురు]

ద్వితీయరంగము

ప్రవేశము—యుద్ధభూమి

(ప్రక్కకుఁ జూచుచు నారదుఁడు పరమేశ్వరుఁడు ఇంద్రాదులు వేల్పులు గంగాపార్వతులు ప్రవేశించు చున్నారు.)

నార—బాగుబాగు! నయన పర్వముగ సంకుల సమరము జరుగుచున్నది. అమ్మా! పార్వతీ! తల్లీ! గంగాదేవీ! అవలోకింపుఁడు కుమారుల యువార్యంబగు శౌర్యము.

ఉ॥ ఘోరతరాహినిం బెలుచఁ గూల్చెడు నగ్గరుఁడుండు వోలె న
య్యారె! గజాననుండు ద్విర దాస్య సురారివధించు వీఁడుగో!
తారకునిం గుమారుఁడు మ దద్విరదమ్ము నుదగ్రశౌర్య వి
స్ఫార మృగాధిపం బటులు చక్కడఁగించు బలారె వాఁడుగో!

నార, ఇంద్రు—జయా! భవానీనఁదనా! గజముఖాసురమర్దనా! జయా! గంగానందనా! తారక దైత్యధ్వంసీ!

(విఘ్ననాయక కుమారులు ప్రవేశించి శివునకు గంగా పార్వతులకు నమస్కరింతురు.)

పార్వ—నారదా! నారదా! జయా! గంగానందనా యంటివి? ఎవ్వని?

గంగ—గంగాకుమారుని.

పార్వ—గంగాకుమారుఁ డెవ్వఁడు?

గంగ—కుమారుఁడే!

పార్వ—ఏమి? యీషడాననుఁడు నీనందనుఁడా? ఇంత యసత్యమా!

గంగ—సత్యాసత్యముల నిర్ణయింప సర్వసాక్షి సర్వేశ్వరుఁడున్నాఁడు.

పార్వ—ఇందే యున్నాఁడు.

గంగ—అంతట నున్నాఁడు.

పార్వ—వేదాంతము చాలింపుము. నాకుమారుని నీకుమారుఁ డంటివి? ఎట్లు నీతనయుఁడయ్యెనో చెప్పుము.

గంగ—నీకుమారుఁ డెట్లయ్యెనో నీవు చెప్పుము.

నార—(ఆత్మ) ఈవాక్కలహము శాపాలాపముల వఱకు వచ్చునట్లున్నది నేఁడు విందుమీఁద విందు నారదునకు.

పార్వ—ఓసురాపగా! అవధరింపుము. బృందారకులు శూరపద్మసింహవక్త్ర తారకులనోంచుటకై కుమారోదయమ్ము గావింపఁ బ్రణితార్తి భంజనుండగు పరమేశ్వరుని బ్రార్థింప మన్నాథుఁడు షడాననంబులతో వ్యక్తంబగు దేహముఁ దాల్చి నిజవామాంకమున నధిష్ఠించియున్న నన్ను మోహదృష్టుల నవలోకింప నురగాభరణుం డూర్ధ్వరేతస్కుండగుటఁ దన్నిటలోచనమ్ముల నాఱింట శుక్లంబు వెడలి మొదట సహస్ర విలయదహన సంకాశమగు తేజమై పిమ్మటఁ గుమారాకృతిం దాల్చినది.

గంగ—నీకంతవఱకే తెలియును. సహస్ర సహస్ర కిరణ ప్రభాభాస్వరము సర్వేశ్వర వీర్యము నీవు భరింపలేకప్పుడు పరువులు వెట్టితివి. అప్పుడు మహాదేవుని యాజ్ఞచే నీయింద్రాదులగు వేల్పులు తద్వీర్యము నన్ను భరింప వేఁడికొని నుచ్ఛరవణ ప్రదేశమున విడిచిపోయిరి. నేనును పరమేశ్వరాజ్ఞందలఁదాల్చి యీతేజమును భరించి కుమారాకృతివహించిన తోడనే

యీశ్వరున కర్పించితిని. వింటివా! ఇప్పుడు వాఁడనుము వీఁడాంబికేయుఁడో గాంగేయుఁడో?

పార్వ—ప్రాణనాథా! ఈగంగ చెప్పినదంతయు సత్యమా?

పర—సత్యము.

పార్వ—సత్యమా! ఆహా! ఇంతయు సత్యమా? ఈకుమారుఁడు గంగానందనుఁ డనుటయు సత్యమా?

పర—నీనందనుఁ డనుటయు సత్యమే.

పార్వ—(వినిపించుకొనక క్రోధావేశముతో) ఆ! దేవతలేమికనిఁ గావించిరి. దురాత్ములారా! బహిర్ముఖులారా! దుర్గాపతి రేకంబున నేథరింపఁదగిన దివ్యతేజము సురనదీ శరవణ ప్రదేశంబున విడిచి నాకింత యపకృతి గావింతురా? మీరింక నన పత్యులయ్యెదరు గాక. మఱియు మీసకలైశ్వర్యములు సకల వస్తుజాతములు, దుర్గవారాశిలోఁ బడుఁగాక.

ఇంద్రాదులు—(హాహాకారముల నొనర్చుచున్నారు)

గంగా—హిమశైలాత్మజా! ఇదియే మన్యాయము?

గీ. ఈశ్వరుని తేజమప్పుడు భరింపలేక
యిపుడు బృందారకుల శపియింప దగునె?
ఉట్టిపైనున్న పాలను నేలఁబోసి
కొనిరయిన నేలదూరుట నుచునె బేల!

పార్వ—[ఆగ్రహముతో] ఏమే? దుర్మదాంధురాలా! వియద్గంగా! నన్నుఁ బరిహసింతువా?

మ. హర జూటాగ్రమునందు నుందునని గర్వాంధ్యమ్మునంజేసి నన్ బరిహాసం బొనరింతె విశ్వజననిన్ ఫాలాక్షు నర్ధాంగి, వి స్ఫుర దీశాన శిఖాగ్రమున్ దొలఁగుమా! క్షోణీస్థలంబందు భూ సురవంశమ్మునఁ బుట్టువందుము వియత్ప్రోతస్వినీ! దుర్మతీ!

గంగ—ఏమే! పాపకర్మురాల! పర్వత పుత్రి! ఈమాత్రమునకే యిన్నిట్లు శపింతువా?

మ. హరు నర్ధాంగమునందు నుంటిననిగర్వాంధ్యమ్మునం జేసి నేఁ
బరిహాసంబొనరించినంతట నిశాపంబీగతింబెట్టెదే!
హరు సామేను దొలంగుమా! జగతిపై నావిర్భవంబందుమా!
వరుఁ జేపట్టక వీరకాంతవగుచున్ వర్తింపుమా! దుర్మతీ!

పర—కాంతామణులారా! మీ కెంతటి యహంకృతి? ఈమాత్రమున కెంతలేసి శాపములఁ బెట్టికొంటిరి.

సీ. ఏది యెవ్వరిది లేదిందు, మదీయమ్ము
సకలంబునుంగూడ సకియలార!
మీతనువుం దుది మీది గాదన నింక
మీతనూజుఁ డెవండు మెలఁతలార!
నిక్కంబు గన్గొన నిక్కుమారుని మీరు
కడుపునఁ గంటిరా పడఁతులార!
ఇంతమాత్రమునకు నింత యహంకార
మూనుట యేటికి నువిదలార!

గీ. కర్మఫలము నందకయుండఁ గాదుగాన
అనుభవింపుఁడు మర్త్యత్వ మలివలార!
చేసికొన్నట్టివారికిఁ జేసికొన్న
యంత యను మాట తప్పునే కాంతలార!

గంగ, పార్వ—సర్వేశ్వర! మాశాపములఁ గ్రమ్మఱింపవీలు లేదా?

పర—ఫల మనుభవింపవలసినదే.

పార్వ—దేవదేవ! పోనిమ్ము. మర్త్యజన్మంబున వీరకాంతనయ్యుఁ దుట్టతుది నీయనుగ్రహమునకుఁ బాత్రురాలనై నిన్నుఁ జేరునట్లు శాపాంత మనుగ్రహింపుము.

గంగా—మహాత్మా! నేనుగూడ మర్త్యజన్మంబున శివభక్తురాలనై తరించునట్లు శాపాంతము కృపసేయుము

పర—మంచిది. పార్వతీ! నీవు మహీతలంబున మధురాధీశ్వరుండగు మలయధ్వజునకుఁ గొమరితవై జన్మించి వరునిఁ జేపట్టక వీరకాంతవై వీరవిహారము గావించుచు నొక దానవుని కారణంబున మత్సన్నిధిం జేరి శాపమోచితురాలవయ్యెదవు. గంగా! నీవు భూలోకంబున శివదేవుండను భూదేవునకు జన్మించి చిన్నతనముననే శివభక్తురాలవై మర్త్యత్వమును బాసెదవు. భగీరథుండను నొకరాజు కారణంబునఁ గ్రమ్మఱ నాజటాజూటము నలంకరింతువు. అప్పుడే పార్వతియు నాయర్ధాంగము నలంకరింపఁగలదు.

గంగా, పార్వ—అనుగ్రహింపఁబడితిమి.

ఇంద్రు—మహాత్మా! మాయఖిలైశ్వర్యములు మా నిఖిల వస్తుజాతములుఁ క్షీరాంభోధిఁబడునట్లీ తల్లిశపించినది. మాకు శాపాంతము దయసేయురా!

పర—దేవేంద్రా! ఆలకింపుము.

ఉ. కవ్వముసేసి మందరము కవ్వపుఁద్రాడొనరించి శేషునిన్
కవ్వపుమట్టుగన్ జలిపి కచ్ఛపరాజుఁ బయఃపయోనిధిన్
మవ్వపువేడ్కతో సురలు మర్త్యులు నిర్భరబాహుదర్పముల్
నివ్వటిలంగఁ ద్రచ్చుఁడు జనించు సమస్త సువస్తుసంపదల్.

ఇంద్రాదు—అనుగ్రహింపఁబడితిమి (దివ్యులు నిష్క్రమింతురు)

నార—[స్వ] ఇంద్రుఁడు పార్వతీదేవియునపత్యులయ్యెదరుగాక యని శపించినది మఱచిపోయి దచ్ఛాపాంతము వేఁడికొనఁడయ్యెను. ఇంతకు వేల్పులనపత్యులు గావలసిన కర్మమున్నది.

పర—కుమారులారా! రండు [కుమారులతో నిష్క్రమింతురు]

నార—జగన్మాతలార! నాకు సెలవొసంగెదరా?

గంగ—బ్రహార్షిచంద్రా! మాకెట్టి కర్మము పట్టినది.

నార—ఇరువురును దొందరపడితిరమ్మా,

గంగా, పార్వ—సత్యము, సత్యము.

పార్వ—కాని నారదా! మా వాక్కలహము పరమేశ్వరుఁడు దగ్గఱ నుండియే యాలకించుచుండెఁగదా? ఆయన కోంచెము కలిగించుకొన్నచో,

గంగ—ఇంతవఱకు వచ్చునది కాదు.

నార—అమ్మా! ఇప్పుడాయన దగ్గఱనుండియే యాలకించి యూరకుండెనంటివి. ఆసర్వమయుండు సర్వకాల సర్వావస్థలయందు సర్వప్రాణికోటులయందు నుండును.

గీ. సాక్షిమాత్రుండవైయుండు ♦ సకలమందు
ఫలమొసఁగఁ బ్రాణులకుఁగర్మ ♦ ములనుబట్టి
చెడుగుఁజేయకంచుకా మంచిఁ ♦ జేయుమంచు
విశ్వపతి చెప్పఁడెవరికి ♦ నీఁపుదట్టి

గీ. మంచిచెడ్డలు సెప్పి చే ♦ యించునేని
కర్మఫలమంద నీనుఁడే ♦ కర్తగాడెఁ
నడుమఁబాత్రలకతఁడడ్డు ♦ నడుచ వేని
ఆతఁడాడించు నాటకం ♦ బాఁగిపోదె.

అమ్మా! సెలవు. [అందఱువిశ్రమింతురు)

## తృతీయ రంగము.

ప్రదేశము—మందిరము.

ప్రవేశము—జంబుకాస్యుఁడు

జంబు—అయ్యో! దేవుఁడా! దేవుఁడా! ఎంతటికర్మము తటస్థించినది.

శశిముఖి—(ప్రవేశించి) జంబుకాస్య! నల్లమందు మోతాదెక్కువైనదా? కప్పను దిన్న పామువలెఁ గదలలేక నిలిచినచోటనే నిలిచి యేమో గొణుగుకొనుచుంటివి.

జంబు—ప్రియసఖి! శశిముఖి! క్షీరసాగరమథనమును గూర్చి చింత పడుచుంటిని.

శశి—ఏమని?

జంబు—పార్వతీదేవి శాపమున దేవవేశ్యలతోఁ బాటు నానుదుటిగీఁత గూడ పాలసంద్రమునఁ బడిపోయినది గాదా?

శశి—ఏమి? ఆవేల్పుఁదొత్తులలో నీతొత్తెవ్వతెయైన నున్నదా యేమి?

జంబు—ఛీ! ఛీ! నీపాదములతోడు. పోఁతపోసిన బంగారపు బొమ్మవు నీవుండఁగా నాకింకొకతె యెందులకే? నీకుఁ జెప్పలేదు గాఁబోలు? నాపెండ్లము గతించిన సంగతివిని నారసికత్వమును, నాసంపాదనను, నాప్రతిష్ఠను బాగుగా నెఱింగినదగుటచే నాకలోకవారాంగనలలోఁ బేరువడిన రంభ పరువెత్తికొనివచ్చి నాపాదములపైఁబడఁగా నప్పటికి నాకన్ను నీమీఁదఁబడి దానినిట్టె యెడమకాలితోఁ దన్ని వైచితిని— ఇట్టి నేను—

శశి—మఱి నీచింత యేమి?

జంబు—ఓసీ! ఆతల్లు లుండఁబట్టి మంత్రముననో తంత్రముననో నయముననో భయముననో యెవతెనో యొకతెను దార్చి మన కాపురము గడపుచుంటిని. ఇప్పుడేమున్నది? ఆయన మంచము మీఁదికి ముండలేదు. మన కంచములోనికిఁ దిండిలేదు.

శశి—పాలకడలిం దరుచుటకుఁ బ్రయత్నము జరుగుచున్నదిగదా?

జంబు—ఏమి ప్రయత్నము— ఆదిలోనే హంసపాదన్నట్లు కవ్వము సేయవలసిన మందరాచలముఁ గొనివచ్చుటకుఁబోయిన సమస్త సురాసురులు దానిఁ గదలించుటకే యశక్తులైరి.

శశ—ఇంకను గదలించుటయేమి? గోవిందుడు దానిఁ బెకలించి రక్కసులతోడను వేల్పులతోడను మోయించుకొని దుగ్ధాంబుధితీరమునకుఁ బోవుచున్నాఁడని రాక్షసులందఱు నచ్చటకుఁ బోవఁ బరువులువెట్టుచున్నారు.

జంబు—ఏమి? మందరాద్రిని మాధవుఁడు పెకలించినాఁడా? ఓరి వీని సిగ దఱుగ- మొన్నటియుద్ధమున వీఁడు నన్నుఁజూచి పిల్లిం జూచి పరుగిడు నెలుకవలెఁ బాఱిపోయినాఁడే. ఇంతలో నంతటి సమర్థుఁ డెట్లయ్యెనబ్బా!

శశ—ఊఁ- గచ్చులకేమిగాని కడలి దరికిఁ బోయెదవా?

జంబు—పోకున్న నెట్లు? నాచేయుఁబడకున్న నాకార్యము గట్టెక్కఁ గలదా!

శశ—సరి. పోయెదవు. పోయి యేమి తెచ్చెదవు?

జంబు—విను. మనము మత్తుకబంటి ద్రావుట కమృతము- మన దొడ్డిలో నాటుటకు పారిజాతవృక్షము- మనకుఁ బాడికి వేల్పుటావు- మనము సాయంసమయముల నదీతీరములకు విహారార్థమై పోవ నెక్కుటకు వెల్లయేనుఁగు.

శశ—నీమొగము నామొగము. అవి యన్నియు నీవెట్లు తేఁగలవు?

జంబు—ఏమే! భీమణసార్వభౌముని దార్వుడు గాఁడు—కాదు- చెలికాఁడెంతకుఁ జాలఁడు.

శశ—వానిమాట నటుండనీ. ముఖ్యముగ నీవు గొనిరావలసినవి విను. కడలిం దరుచు నప్పు డందున్న నత్తలు, పీతలు, చేపలు నీటిగుఱ్ఱములు బయటఁబడునుగదా? వానిలో నీవెన్ని మోయఁ గలవో యన్నిఁటిని మూటఁగట్టుకొని రమ్ము.

జంబు—ఓసీ! నాయంతటివాఁడు మూటఁ మోసికొనివచ్చుట యవమానకరము గాదా?

శశి—ముండ్లఁ దీసికొనివచ్చుట గాదు గాబోలు— పోని నేను వచ్చి తెచ్చుకొనెదను లే.

జంబు—ఆ! ఆ! నీవా! కోడెల మందలోనికి వచ్చిన కూఁబెయ్య నట్లు లంతమంది మగవారిలోనికి వచ్చిన నాఁడుదాని బ్రదుక నిత్తురా! వలదు వలదు. నేనే మోసికొనివత్తును లే.

శశి—సంతోషము. తెచ్చితివా! ముద్దులు— లేనిచో గ్రుద్దులు నమువుము.

(నిష్క్రమించుచున్నారు)

చతుర్థరంగము.

ప్రదేశము—క్షీరసాగరతీరము.

ప్రవేశము.

మంథరాచలమునకుఁ దఱిత్రాడుగా గట్టఁబడిన శేషుని తలవంక దైత్యులు, తోఁకవంక వేల్పులు నిలిచియుందురు.

భీషణుఁడు, రాహుకేతువులు, జంబుకాస్యుఁడు మఱికొందఱు

ఇంద్రుఁడు, సూర్యచంద్రులు మఱికొందఱు

(ఒకప్రక్క నారదుఁడు నిలిచియుండును.)

భీష—ఓపాకారి ప్రముఖ బర్హిర్ముఖులారా! దుగ్ధపాథోరాశి మంథన ప్రారంభమున సర్వపూర్వ సుపర్వకోటుల పక్షమున నేను మీకుఁ దెల్పఁదలఁచుచున్న విషయము నాకర్ణింపుఁడు.

చ. త్రిదశచయంబువోలె నరుదెంచిరి దానవులెల్ల నంబురా
శిఁ దరువ నీశ్వరాజ్ఞ, నటఁ జేకుఱు సర్వసువస్తుసంపదల్
త్రిదశులు నేముఁ బంచికొని తీరవలెన్ జుమి; యేఱుదాఁటి తె
ప్పఁదగులఁ బెట్టువారలు సుపర్వులుగావున ముందె చెప్పితిన్॥

రాహు—సరిగాఁ బంచియీయనిచో మీకును మాకును యుద్ధము సిద్ధము.

కేతు—అంత్యనిష్ఠురముకన్న నాదినిష్ఠురము మంచిదిగదా?

ఇంద్రు—(దేవతల యంగీకారమునకు దేవతలవంకఁ జూచుచుండును. వేల్పు లంగీకారముఁ దెలుపునట్లు తలలాడించుచుందురు)

జంబు—(అపవారించి) భీమణసార్వభౌమా! నీవింకొక సంగతిఁ జెప్ప మఱచితివి. పాలకడలిం ద్రచ్చుటవలన బయటఁబడు సమస్త జలచరములు దైత్యుల సొత్తేకాని యమరులవి గావని చెప్ప వలయును.

భీమ—(అపవారించి) చీ! మూర్ఖుఁడా! అవి వారికెందులకురా?

రాహు—(అపవారించి) దానవేశ్వర! అమృతముఁ ద్రావుటవలన నీ ముండకొడుకులు చిరకాలజీవులగుచున్నారు. వీరి కన్నొ అంగి యమృతకుంభమును మన మెల్లెన నపహరింపవలయును

జంబు—(అపవారించి) ఇంకొకమాట! బందెలదొడ్డికిఁ బశువులఁదోలి కొనిపోయినట్లు వేల్పుదొత్తుల నందఱ మన పీటికిఁ దోలుకొని పోవలయును.

భీమ—(అపవారించి) మంచియాలోచనము.

ఇంద్రు—ఓదైత్యేశ్వరా! త్రయస్త్రింశత్కోటి దేవతలపక్షమున నేను నీ తెలియఁ జేసిన విమయమున కంగీకారము దెలుపుచున్నాఁ డను. కార్యారంభమునకు గడంగుఁడు.

భీమ—మథింపుఁడంభోరాశిని మథింపుఁడు.

(సురాసురులు దరుచుచున్నారు)

నార—మేలు! మేలు.

ఉ. బంతులుదీఱి దైత్యులు సు రవర్యులు నట్టిటుసేరి, వారిధిన్
బంతిమెలర్పఁ దర్వ దిగి రభ౦బుల కర్ణములంబగిల్చె దు
ర్దాంత ఘుమంఘుమధ్వనులు,రె దాఁకెనభమ్ముఁబయః స్తరంగముల్
గంతులువెట్టెమర్గులు జ రగంబులబ్రమింగెకుచాయ దిక్కు లన్.

జంబు—(అపవారించి) ఓరీ రాహుకేతువులారా! పాముతోఁ గట్టి కొన్న పగుపుపోవునని శిరమువంక సిలిచితి రిప్పుడు ప్రాణమే పోవునట్లున్నది. విషవాయువు వచ్చుచున్నది. విషముగ్రక్కు-చున్నాఁడు శేషుఁడు.

కేతు—(అప) నోరుమూసికొనుము. ఏదిరా ?

రాహు—[అప] విసపుగాలి వీచుచున్నట్టులేయున్నదిరా? ఊఁ! ఊఁ!

నార—ఓహో! యిదియేమి? పాథోనిధి గర్భమున బడబానల ముద్భవించుచున్నట్లున్నది.

భీమ—అహా! కాలకూటము!

చ. బుడబుడమంచు నబ్ధి జల ఽ పూరముఁబిట్టుడుకంగడంగెఁ గ్రా
గెడు నెసరట్లు, క్రొంబొగలు ఽ గీల్కొనె వీచులఁ జీకటుల్ బలెన్
మిడుసరి మి త్రిలోకముల ఽ క్రింగఁగఁ జాఁచిన నాల్కలోయనన్
బొడమెను గీలముల్ గడలి ఽ బుట్టె విసంబదె కాలమూర్తియై
ఆపన్నప్రసన్నా! పన్నగాభరణ! రక్షింపుము.

(అని హాహాకారములు సేయుచు సురాసురులు పర్వులు వెట్టుచున్నారు)

[నేపథ్యమున]

భయపడకుఁడు. భయపడకుఁడు.

నార—గీ. అదె! త్రిలోకరక్షాదక్ష ఽ మైనబాహు
వెత్తి భయపడకుండంచు ఽ నేఁగుదెంచు
చున్నవాఁడు లోకమ్ముల ఽ గన్నవాఁడు
సంశ్రితావనమూర్తి శ్రీ ఽ సాంబమూర్తి.

(పరమేశ్వరుఁడు సాక్షాత్కరించి హాలాహలపాన మొనర్చుచున్నాఁడు)

ఇంద్రు—ఆహాహా!

గీ. భక్తకోటి యాపద్రమింగు ఽ భవ్యమూర్తి
గుటుకుమని మ్రింగినాఁడదే ఽ కటికివిసము-

గిరిశ కంఠాభరణమయ్యె గరళ మదిగో!
నీలరత్నశలాకయుం బోలె నహహా॥

అందఱు—జయా! సంశ్రితార్తిభంజనా! జయా! హాలాహలపినీల
కంఠా! జయా—

అనుబంధము 5.

పర—క్షీరవార్ధినిఁ దిరుగ మధింపుఁడు. నిర్విఘ్నమ్ముగ సర్వవస్తువులు సంభవింపఁగలవు.

[అంతర్ధానము]

(తిరుగ మధించుచున్నారు)

రాహు—అదిగో! లక్ష్మీదేవి- దాని హరిఁ గైకొనుచున్నాఁడు.

కేతు—అదిగో! ఐరావణోచ్చైశ్శ్రవంబులు వాని నింద్రుఁడు గైకొనుచున్నాఁడు.

జంబు—అప్సరసలు! అప్సరసలు! వీఁడెవ్వఁడమృతకుంభముఁబట్టికొని?

భీమ—ధన్వంతరి, వానిఁబట్టికొనుఁడు.

రాహు—పోనీకుఁడు.

భీమ—(అమృతకుంభమును లాగికొనుచునాఁడు)

(సురాసురులు యుద్ధముసేయుఁదలపడుచున్నారు)

నార—బలే! బలే విష్ణుదేవుఁడు దైత్యుల వంచించుటకు మోహినియై వచ్చుచున్నాఁడు.

మోహి—[ఆకసమునుండి దిగుటనభినయించుచుఁ బ్రవేశించుచున్నది]

[ఇంద్రాదులు భీమణాదులు మోహినింజూచి యాశ్చర్యపడుచు నిశ్చేష్టులగుచున్నారు).

మోహిని—[హావభావముల నందఱనులికించుచు]

చ. కలహము మానుఁడీ సురలు, క్రౌర్యముపీడుఁడు దైత్యపుంగవుల్
దలపఁగ మీరలన్నలును దమ్ములు, మీరలు మిమ్ముఁజంపుకోఁ

దలపడనేల! మీకు నిట ధర్మవు సెప్పెడువారు లేరొకో?
వలదు కఃగుండు ఖండనము, ప్రార్థన సేసెద మీకు మ్రొక్కెదన్.

అందఱు—వలదు, వలదు, ఓమాపాలిటి మోహినీదేవతా! నీకే మేము మ్రొక్కెదము.

(అందఱు సాష్టాంగపడుచున్నారు)

భీమ—

కం॥ ఆకృతిఁ గాంచెను సత్యము?
చేకొనెనో రూపు మూర్తిఁ? జేడియతనముల్
గైకొనిమెనొకో ధర్మము?
గాకీకల్యాణమూర్తి గలదే యెందున్॥

ఓ సురాసురకోటులార! ఈ త్రిజగన్మోహిని మనగోత్రకలహంబు మాన్పుటకు సాక్షాత్కరించిన మనపాలిటి దేవత. ఈముద్దులగుమ్మ యెట్లు సెప్పిన నట్లు మన మందఱము విందము.

దేవ, రాక్ష—మాకిది సమ్మతము. మాకిది సమ్మతము.

భీమ—ఓకల్యాణీ! ఓత్రిలోకమోహినీ! ఉభయవాదుల పక్షమున నేనీ సుధాకలశమును నీముద్దుకేల నిడుచున్నాఁడను. నీవు వీరికిఁ బ్రియురాలవుగావు. మాకుఁ బ్రియురాలవు గాకపోవు. నీ వాగమృతంబును మాకర్ణపుటంబులకు, నీ లావణ్యసుధారసమును మానేత్రంబులకుఁ బక్షపాతము లేక పంచిపెట్టిన ట్లీ యమృతరసమునుగూడ మాకందఱకు సంపూర్ణానుగ్రహముతోఁబంచిపెట్టుము. (అమృతకుంభము నిచ్చుచున్నాఁడు.)

మోహి—[సంశయించుచుఁ జేకొని] ఓరసికాగ్రగణులారా! ఓపురుషసింహములారా!

ఉ॥ ఇంతకు నిట్టిపంపకము లేనొనరించి మెఱుంగ, బేల న
న్నింతటికార్యమందుఁ దగ వేసియమించుట? పెద్దవారు మీ

యంతటివారిమాట నెటు ౕ లక్కట కాదన? నేమిసేయుదుఁ
బంతునుగాక యీసుధను ౕ బంతులు రెండుగఁ గూరుచుండరే.

అందఱు—ధన్యులము. ధన్యులము.

[వేల్పులందఱొకపంక్తిగాను, రక్కసులందఱొకపంక్తిగాను కూర్చుందురు]

మోహి—(హావభావవిలాసములతో తథ్య మిథ్యా సుధారసములు సురాసురులకుఁ బోయుచున్నది)

చంద్రు—[సూర్యునితో] అగ్రజా! ఇది మాయాకాంతకాదుగదా?

సూర్య—[చంద్రునితో] విష్ణుదేవుఁడు.

రాహు—[కేతువుతో] ఇది దేవతలకుఁబోయు నమృత మొకతీరుగాను, మనవారికి వడ్డించు నమృత మొక తీరుగాను గనఁబడుచున్నది. మనము వారి పంక్తిఁ గూర్చుందము.

కేతువు—మంచిది. [ఇరువురులేచి వేల్పుల పంక్తిం గూర్చుందురు]

మోహి—(రాహు కేతువుల కమృతముపోయుచుండును)

సూర్య, చంద్రు—వారిరువురును రాహు కేతువులు'

మోహి—(చక్రమున వారిరువురి కంఠములఁ దెగ్రవేయును.)

భీమనాదు—[భయసంభ్రమములతోఁ బాఱిపోవుదురు. ఇంద్రాదులు వారివెంటఁబడుదురు. మోహిని యంతర్ధానమగును]

నార—ఏమి చిత్రనాటకము! ....................ఆహా!

మ. అలివేణీమణి లక్ష్మినిష్ణునకు, న ౕ య్యైరావణోచ్చైశ్శ్రవం
బులుఁబాకారికి, వేల్పుమూఁకకమృతం ౕ బుఁ, నాగవల్లీదళం
బులు క్షోణీప్రజకిచ్చి, నిర్భర దయాం ౕ భోరాశియై, దాహాలా
హలముంగైకొనునట్టి దాతకివెజో ౕ హారుల్ జగన్నేతకుఁ

[నిష్క్రమించును]

—oo—

# శివలీల.

## తృతీయాంకము.

### ప్రథమ రంగము.

ప్రదేశము—శశిముఖి యిల్లు.

ప్రవేశము—జంబుకాస్యుఁడు.

జంబు—(ఆత్మగతము) ఉద్యోగం పురుషలక్షణమ్. తార్పుడుతనము మాత్ర ముద్యోగము కాదా? అందును వారికా వీరికా? భీషణదానవసార్వభౌమునికి.

శశిముఖి—(ప్రవేశించి) జంబుకాస్య! కవిత్వపుఁ బిచ్చి పట్టినవానికిఁ బలె నీకిప్పుడు గొణుగుడు రోగమే!

జంబు—గొణుగుడు గాదే. నాకిప్పు డొక ధర్మసందేహము గలిగినది.

శశి—ఏమది?

జంబు—తార్పుగానితన ముద్యోగ మగునా కాదా? అందు గౌరవ మున్నదా లేదా యని.

శశి—లేకేమి? రాజుగారి ప్రక్క నెత్తువానికే గౌరవమున్నప్పుడు రాజుగారి ప్రక్కలోనికి పడుపుఁబడఁతుల సమకూర్పువానికి గౌరవము లేకుండునా? ఆఁ! ఛీ తార్పుగానికి గౌరవమే! తార్పుగాని తొత్తునకు గౌరవమే! కాని నాలుగైదు దినముల కైన నేకాదశీవ్రతము తప్పదు.

జంబు—చీ! చీ! మానవపశువుల కుండఁదగిన యేకాదశీవ్రతము దానవకేసరుల కెక్కడిదే?

శశ—వ్రతము లేదుగాని వ్రతవిధానము మాత్రమున్నది.

జంబు—అదేమి?

శశ—ఉపవాసము. ప్రభువుగారి పట్టెమంచము మీఁదికొక పదుపు ముండ యెక్కినఁగాని మనకుండ ప్రాయినెక్కదుగదా!

జంబు—దానికెవరేమిసేయుదురు? నీకు గంటకు కాయ సారాకావలయును. నాకు గంటకు తులము నల్లమందు గావలెను. ఎంత సంపాదించిన నిందులకే సరిపోవుచున్నది.

శశ—ఇంత కిట్టి నీచవృత్తివలన సంపాదించిన ధనమున కభివృద్ధి యుండదఁట కాదా!

జంబు—ఎవరన్నారు దేవయ్యలు? అన్యాయార్జితధనమునకే యభివృద్ధి యెక్కువ. పెంటమీఁదఁ బుట్టిన చెట్టే బాగుగా పెరుగును గాదా! ఈ మాటలతో నేమి? చూతువుగాని ఇప్పటి నాసంకల్పము నెఱవేఱినీ- ప్రభువుగారు పదివేల టంకములు బహుమాన మిచ్చుట కొప్పుకొన్నారు. అప్పుడు మూఁడు పువ్వు లాఱు పిందెలు గాయింతును.

శశ—ఏమా సంకల్పము?

జంబు—పూనన కాంతలలో మన ప్రభువుగారికిఁ బనికివచ్చు మదవతీమణుల వెదకివచ్చుటకు నేనిదుమ భూలోకమునకుఁ బోయియుంటినిగదా? అప్పుడు రంభాదులకన్న చక్కనిచుక్క, మలయధ్వజుని పుత్రిక మీనాక్షియను చకోరాక్షి నాకంటఁ బడినది.

శశ—చూచి యూరకెంకలకుఁ దిరిగి వచ్చితివి? మచ్చుమందుఁ జల్లి యెత్తుకొని రాలేక పోయితివా?

జంబు—మచ్చుమందులకు మైమఱచునది గాదది. నిఖిలమంత్ర తంత్రముల నెఱింగిన నెఱజాణ. అది దిగ్విజయముసేసి మధురానగ

రము రాజధానిగా భూలోకము నేకాతపవారణముగఁ బరిపాలించుచున్నది.

శశ—ఏమి? వంటయింటిలోఁ గరిటెఁబట్టుకొని తిరుగవలసిన వనిత కత్తిఁబట్టికొని కదనరంగమున కెక్కి దిగ్విజయముసేసి ప్రభుత్వముసేయు చున్నదా? ఆహా! మాస్త్రీజాతి కెంత కీర్తి దెచ్చుచున్నది? మహిషాసుర మర్దనియగు పార్వతి మధురాధీశుని తనయయై జన్మింప లేదుగదా?

జంబు—ఏమో? లోకమునఁ గొందఱు గంగాదేవి శాపమ్మునఁ బార్వతి మలయధ్వజుని తనూజయై జననమందినదని చెప్పుకొనుచున్నారు.

శశ—అట్టిదానిని నీవెట్లు గొనిరాఁగలవు.

జంబు—నేనుదానినిగొని రానక్కఱలేదు. దానికింతకు వివాహము గాలేదు. మదనసదృశమూర్తియగు మన మహారాజును గన్నులతోఁ జూచుటయే తడవుగ నదివలచి మీఁదఁ బడునని నా నమ్మకము. ఒకవేళ నట్లుగాకున్నను మహావీరాగ్రేసరుఁడు మన ఱేఁడు బలిమినైన దానిఁ బరిగ్రహింపఁ గలఁడు. నేఁడే మాయిరువురి ప్రయాణము.

శశ—ఈప్రయాణము యమపురికిఁగాదుగదా? అది మీయిద్దర క్రింగునేమో?

జంబు—ఏడ్చినది.

శశ—అదియేమ్పుట యేమోగాని నీవు చచ్చినచో నీప్రాణాలకుఁబడి నేనేడ్వవలసివచ్చును.

జంబు—ఓసీ! నేను జచ్చినచో నీవు ముండమోయవలసి వచ్చునని దిగులుపడుచుంటివా? భయములేదు. జగదేకవీరుఁడగు భీమణదానవేశ్వరుని దండనున్న నాదండకు వచ్చుటకు మృత్యుదేవతకూడ భీతిల్లును.

శశ—నీమొగము! ముండమోయుటయేమి? వేశ్యలము నిత్యసువాసినులముగామా?

జంబు—ఆ! ఆ! ఏమే? నేను జచ్చిన నీవు ముండమోయువా? అయ్యయ్యో! కులమువిడిచి, గోత్రము విడిచి, మంచివిడిచి, మర్యాదవిడిచి, యింతకాలమునుండి నిన్నుఁ బోషించుచున్న నేనుజచ్చుటయు నీవు నిత్యసువాసినీత్వమును వెలుఁగఁ బెట్టుకొనుటయునా?

శశ—మిడుకకు, జంబుకాస్య! నీవేముండమోయని యట్లంటిని గాని వేఱుకాదు. ఇదిగో! విను, నీవునిజముగాఁ జచ్చిన నాగాజులు పగులఁగొట్టుకొందును. ఊఁ. నానుదుటిబొట్టు జెఱుపుకొందును. ఊఁ. నాపుస్తెపుటుక్కున ద్రెంచుకొందును. ఇప్పుడెందులకు? నీవుచావఁగనే నేనట్లు ముండమోయుదునో నీవే ప్రత్యక్షముగా నీరెండుకన్నులతోఁ జూడఁగలవు.

జంబు—చూచుచు నూరకుందునా? ఎంతమహాపతివ్రతవేయనిమెగిరి నీచెక్కుల నిట్టెముద్దాడనా?

శశ—ముండమోయుటతోఁ దృప్తినొందుదుననుకొంటివా? సహగమనముఁగూడఁ గావింపనా?

జంబు—ఆఁ! సహగమనమా? అమ్మబాబు! వలదు వలదు, నీవు సహగమనము సేసిన నేఁజూచి బ్రదికియుండఁగలనా? నాప్రాణ మెగిరిపోదా? వలదు వలదు.

శశ—ఊఁ! నేఁజేయకమాన.

జంబు—వలదు వలదు. బ్రతిమిలాడుకొందును. పాదములఁబట్టికొందును. నీవు త్రాగినంత సారాయము బోయింతును.

శశ—ఇప్పుడు పోయింతువా?

జంబు—ఆ! పద, పానమందిరమునకుపద (పరిక్రమించుచున్నాఁడు) అమ్మా! ఇప్పటికి నాప్రాణము కుదుటఁ బడినది. [నిష్క్ర]

## ద్వితీయ రంగము.

ప్రదేశము—సభామందిరము.

ప్రవేశము—మీనాక్షి.

మీనా—(ఆత్మగతము) నెలఁతల కింత స్త్రీంశ భావము తగదని కొంద అందురు. పురుషులకుఁ దగినప్పుడు పొలఁతుల కేల తగదో? సకలకారణుఁడు సర్వేశ్వరుఁడు నైతము సంవర్త సమయమునఁ బ్రాణిహింసకుఁ బాల్పడఁడా? ఆలోకేశున కదియు నొక క్రీడయుందురుగాదా? కావున నిజబాహాబల ప్రదర్శనము దోషరహితము. నిత్యానంద రసైకాశ్రయము మఱి పరబ్రహ్మాత్మకము కాని నాసమీాకకాంక్ష కంతమే గన్పింపదేమి?

ఉ. చేసితిఁ బెక్కుయుద్ధములు, సేసితి స్నానము రక్తవార్ధులన్,
గోసితి మత్తవైరిభట కోటుల గొంతులు గుట్టలేర్పడన్
వేసితి నీశుకంఠమున వీరశిరస్సుమమాలికావలుల్,
వేసర దింతకున్ మనము విక్రమకేళి కొకింతయేనియున్.

(ప్రవేశము సేవకుఁడు)

సేవ—మహారాజ్ఞీమణి! భీషణ దనుజేశ్వరుండఁట, మీాదర్శనమునకు వచ్చి ద్వారము కడనిలిచి యున్నాఁడు.

మీనా—ఏమి? భీషణ దనుజేశ్వరుఁడా? దిగ్విజయము గావించి నప్పుడు వీనిపేరు విన లేదే? వీఁడు పాతాళలోకేశ్వరుఁడేమో? నాకత్తి త్రుప్పువదలింప వచ్చినాఁడేమో? ఓరీ! సంగరాభిలాషమున వచ్చిన వాఁడగునో కాఁడో తెలిసికొని సమరేచ్ఛఁ జను దెంచిన వాఁడగునేని లోనికిం గొనిరమ్ము

సేవ—(నిష్క్రమించి భీషణజంబుకాస్యులతోఁ బ్రవేశించును)

జంబు—[అపవారించి] సార్వభౌమా! ఆయంబుజాక్షియే మీనాక్షి. చూడుము. వాలుఁగన్నులతో దివ్యకల్యాణ మంగళ మోహన మూర్తివగు నిన్ను మోహదృష్టుల నెట్లవలోకించు చున్నదో?

భీమ—[అపవారించి] ఓరీ! నీవు పొరపడు చుంటివి అవి మోహదృష్టులు గావు. సంగరదాహదృష్టులు, మఱి, యీ వీరకాంతా శిరోరత్నము శౌర్యమునేగాని సౌందర్యమును మెచ్చునది కాదు. పరికింపు మీమూర్తిని.

గీ. తలఁప శృంగారరసగర్భి తంబకాక
వీరరస సముల్లసితమీ వెలఁదిమూర్తి!
భుజగవేష్టిత చందన భూజ, మింతి
భామినీరూప మృత్యువే వత నిజంబు.

మీనా—ఓరీ యెవ్వఁడవునీవు?

జంబు—(ఆత్మగతము) వ్యాపారము చాలపెళుసుగా నుండునట్లున్నది (ప్ర) ఓలోకేశ్వరీ! ఈమహామహుఁడు పాతాళ లోకేశ్వరుఁడు.

భీమ—ఓభువనమోహినీ! నేనెవ్వఁడనో వాకొనుచున్వాఁడ నవధరింపుము.

సీ. ఎవ్వానిపేర్విన్న నీరేడులోకముల్
గడగడనే ప్రొద్దు వడఁకిపోవు?
పాకశాసనపాశి పావకప్రముఖ ది
క్పాలురెవ్వానికి పాదభక్తు?
లభిరామకేళి హ ర్మ్యంబు లెవ్వానికి
సంగ్రామరంగముల్ సంతతమ్ము
ఏవీరుమేనర మేశు భీకరచక్ర
ధార నీలోత్పల ధారయయ్యె?

గీ. అప్సరస్స్త్రీ సహస్రంబు లహరహంబు
సేయునవనిస్వయంగ్రహా శ్లేషణంబు ?
వీఁడెవాఁడు మాద్యద్వైరి భీషణుండు
భీషణుండు దానవకుల భూషణుండు.

మీనాక్షి—మేలు! వీరాగ్రణీ! మేలు ! ఇంతటి శూరశిరోమణివి కావుననే మృత్యుదేవతాకరాళ వదనమునకుం బాటియగు మత్సన్నిధానమునకు రాసాహసించితివి నినుబోఁటి పోటు బంటుతో నేటికిఁ గలనుసేయు కలిమి గలుగుటకు మామక ప్రాగ్జన్మకృత సుకృత ఫలమే కారణము. సంతోషము.

శా. మత్తారాతి జయాభిలాషకలితా స్మద్బాహుకండూతి వా
సిత్తోయాకర మేఖలంగలిగితే వీనాఁటికిన్, వీరవం
శోత్తంసంబ! బళే! నుతింపఁదగునీ యుద్ధేచ్ఛ, వాక్ప్రవ్వమా!
కత్తింబట్టెదొ ?విల్లువట్టెదవొ? సం గ్రామమ్ము గావింపఁగన్.

భీ—(ఆత్మగతము) తలఁచినట్లే ప్రత్యుత్తరము వచ్చినది అయిన నట్లనిచూచెద (ప్రకాశము) ఓమధురవాణీ! మధురాప్రభ్వీ !

ఉ. అంటినఁగంటు నీయొడలి నక్కట! యక్కటికంబు లేకనీ
కంటులు సేయవచ్చిన ఱ కర్ముఁడఁగాను, నిజంబెఱుంగు వా
ల్గంటి! బిసప్రసూన మృదులంబులు మామక బాహువల్లికల్
రెంటిని నుయ్యెలంజలిపి నిర్మలమెల్లన నూఁపవచ్చితిన్.

మీ—ఛీ! ఛీ! దానవాకారపశువా! పెద్దపులివోలె జంకులేక బింకముతో నరుగుదెంచి పిఱికిపిల్లి యఱపు లఱచుచుంటివేమిరా? చేతనైనచోఁ గత్తివట్టుము. లేనిచో వచ్చినత్రోవఁబట్టుము. అధికప్రసంగము వలదు.

భీమ—ఓమధురామీనాక్షీ! పుండ్రేక్షుకోదండుని పూవుదూపులకోడి నీచరణ పల్లవంబులంబడి నేశరణువేఁడరా నీవు కఱకుఁగత్తిని

నన్ను ఖండింప నెంచుట ధర్మమా! ఓకృపామయీ! ఇది యెక్కడి యన్యాయము?

సీ. నీపాణిని గ్రహింప నేనపేక్షింప నా
ప్రాణమీవుహరింప నాసవడెదె?
నిన్నుఁ గౌఁగిటఁ జేర్ప నేను వాంఛింప నక్క
గాడుసేర్పఁగనీవు కాంక్షవడెదె?
నీమెడఁ బూదండ నేనేయ నెంచ నా
మెడనీవు గత్తిని పిడఁదలంతె?
నీమోవి తేనియ నేఁగ్రోలఁ దలఁప నా
రక్తమీవాన నాసక్తివడెదె?
గీ. నిన్నుఁ బూసెజ్జకుం దార్ప నేఁదలంప
నన్నునీవు చితికిఁ దార్ప నెన్నెదఁటవె?
ఇంత చెలిమి నేఁగామింప నింతనీవు
పగవలతె కాంత! కరుణఁజూపవె! రవంత

మీనా—ఓరీ! కాముకపశువా! స్తోత్రపాఠ శ్రవణాసక్తములుగావు మత్కర్ణంబులు వీరసింహనాదశ్రవణాసక్తములు లావణ్యావలోకన లోలములుగావు మల్లోచనములు. ప్రతిపక్ష రక్తావలోకన లోలములు. తుచ్ఛకేళీవిహార లాలసముగాదు మన్మానసము, సంతతసంగర కేళీవిహారలాలసము. తెలిసినదా? పూసెజ్జలఁబొరలాడి పొంగునదికాదీ శరీరమంప సెజ్జల నెంపటి లాడి ప్రియపడునది. పాఱిపొమ్ము. ఇఁక నిలువకిక్కడ. నీయంతఃపురాంగనల చెంతకుఁ బర్వెత్తుకొనిపోయి వారి నడుమఁ గూర్చుండి పాచిక లాడుకొనుము. నిరంతర కాంతాలోలురగు నినుబోఁటి నిర్భాగ్యులు పాయని రోగములతో మంచమెక్కి జనమున కింతింతకృశించి చచ్చి నరక లోకమునకుఁ బోవలసినదే కాని పిఱికికండలేక మొఱకుబంటులై కత్తివట్టి కదనరం

గము మెట్టి వీరమరణముఁ గాంచి సంతత స్వర్గసౌఖ్యమును గాంచనోచెదరా? ఊ! నడువుము. నీబోఁటిపిఱికి పంద మొగము జూచుటకు నాకన్నులు సహింపవు.

భీమ—ఓమూఢురాలా! ఈ భీషణాసుర సార్వభౌముని పిఱికిపంద యనియే తలంచుచుంటివా ?

ఉ. నీసుకుమారదేహమును నిష్ఠురహేతిని నొంచలేకగా
నీసుమకోమలా! వెఱతునేనిను బోఁటికి బేలబోటికిన్?
కేసరి జంకునేహరిణికిన్? విలుమాఁజిద్రుటిన్ నిరాయుధన్
జేసెద. నాకవుంగిటకుఁ జిక్కక యెడకుఁబోదో చూచెదన్.
రా. రా.

మీనా—రా. వీరమ్మన్యా! రా! అదిగో! ఆబయలు యుద్ధమునేయు టకుఁ దగినది. అక్కడకుఁ బోవుదము రా.

(మీనాక్షి. భీమణునితో నిష్క్రమించును)

జంబు—అవురవురా! ఇదియెక్కడికాంత! జగజంత!. ఎంత ధైర్యము? నిశ్చయముగ నిదియాఁడుదియేనా! నాటకములో నాఁడువేసము వేసినవానివలె మగవాఁడు కాఁడుగదా? ఏమికర్మమో? ఆనాఁడు విష్ణుదేవుఁడు మోహినియై యమృతమంతయు నమరులకుఁ బోసి మానోట గడ్డకొట్టలేదా! ఇదియట్లే మహారాజును మట్టుపెట్టుట కెవఁడైన వేసినవేషమేమో! అదిగో! గత్తి పోరుజరుగుచున్నది. అయ్యో! అయ్యో! ప్రభువుగారి యొడలంతయు రక్తమయమైనది. ఈమహామారి కొంక్కగాయమైనఁ గాలేదు. అయ్యో! అయ్యో! పాఱిపోవుచున్నాఁడు. ఇది వెం టఁబడినది. మహారాజా! మనము కామరూపులముగదా? చిలుకవైపాఱిపొమ్ము. ఆహాహా! చిలుకయై పాఱిపోవుచున్నాఁడు లేఁడు. ఇఁకబ్రతికినట్లే. ఆహా! ఇదియుఁ గామరూపిణియా! డేగయై వెంటఁబడినది. అయ్యో! ఇఁకనెక్కడిప్రభువు— ఇం

కనెక్కడి ప్రభుత్వము? నేనొకదోమనో పిట్టనో యై దీనికిఁగనఁబడకుండ వెనుకనరిగి మహారాజు గతియేమగునో చూచిపోయెద.

(నిష్క్రమించుచున్నాఁడు)

## తృతీయ రంగము.

ప్రదేశము — కైలాసప్రాంతము.

(ప్రవేశము. రక్తసిక్తాంగుఁడై భీముఁడు వడఁకుచు)

హా! దైవమా! నేఁడు నాకు ఘోరమరణము దప్పనట్లున్నది. ఏడకుఁబోయిన నాడకీ వీరకాంత నాక్రీనీడచందమున నను వెంబడించుచునే యున్నది. అక్కటా! పాదాది శిరః పర్యంతము కాయము గాయములతో నిండిపోయినది. చిమ్మన గొట్టములనుండి చిమ్మఁబడినట్లు గాయములనుండి రుధిరధారా పరంపరలు వెలువడుచున్నవి. దేహమున రక్తముతోఁ బాటు శక్తియు క్షీణించుచున్నది. ఏరూపునఁ బ్రాణములు రక్షించుకొందమన్నను నాపాలిఁటి కాళరాత్రి ననువిడువకున్నది.

సీ. సింగిని జిలుకనై । నెగయుచునేఁ బాఱ
డేగయై వెంటాడెఁ । దీఁగఁబోఁడి
భుజగంబ నైయేను । బొదలలోఁ బర్విడ
ముంగియై వెంటాడె । ముదితమిన్న
అడవుల హరిణంబు । నైనేను బరువెత్త
వ్యాఘ్రియై వెంటాడె । వనజగంధి
అంభోధిఁ జిర్మను । నైనేను బఱవఁ బె
స్మినయి వెంటాడె । మీననేత్ర
గీ. అదిగో కామినీరూప కృ । తాంతమూర్తి!
వచ్చుచున్నది నాపాలి । పైఁడిసత్తి

చచ్చెఁగాలి సత్తువ శ్రమ మెచ్చెనయయొ
యేమిసేయుదు నీశ్వరా! యెందుఁబోదు?

[ముందునకుఁజూచి] ఆహా! కంఠేకాల యశోను ప్రాసము కైలాసము చూపుమేర దూరమునఁ జూపట్టు చున్నది. ఆ రజతశిర ణ్యుఁడు గదాయఖిలేశ్వరుఁడు! ఆయురగా భరణుని చరణాంబుల ప్రాలి నా ప్రాణములఁ దక్కించు కొనెదఁగాక.

(పరుగిడుచు నిష్క్రమించు చున్నాఁడు)

(మీనాక్షి కృపాణము చేతఁ దాల్చి రక్తవస్త్రములతోఁ బ్రవేశించుచు)

మీనా—ఓరి! పాఱుఁబోతు పసరమా! దానవరూపమశకమా! నామస్మరణమాత్ర సంచలిత చతుర్దశ భువనుండవు గాఁబో లునే? ఆజి నాఁడుదాని కోడిపందతనమ్మున బ్రతుకు జీవుఁడా యని పరువిడు చుంటివేమిరా? నీవుపరువిడిన నీమృత్యువునీతోఁ బరువిడ లేదా? నీవుజంకిన నీమృత్యువు జంకునా? నిలువుము. దురాత్మా. నిలువుము.

(నిష్క్ర మిం)

## చతుర్థ రంగము.

—o—

ప్రదేశము కైలాసము.

(పరమేశ్వరుఁడు ప్రవేశము.)

భీమ—(ప్రవేశించి చేతులు జోడించి)

సీ. విసము నల్లంగ్రోలి విశ్వచతుర్దశ
భువనముల్ ప్రోచిన పుణ్యమూర్తి,
కాళరాత్రివదన గహ్వరంబుననుండి
శైలాదిఁగాచిన సదయహృదయ!

వజ్రిని రోధించి ✽ వైశ్వానరుఁగుమారు
పాలనంబొనరించు ✽ పావనాత్మ!
యమునిగర్వమడంచి ✽ యలమృకండు తనూజు
ప్రాణముల్ మనుచు కృ ✽ పాసముద్ర!

గీ. మిత్తి నాప్రాణముల పాలి ✽ సత్తి దీని
నడ్డగించి నాయాపద ✽ నపనయింపు
మార్తజనశరణ్యా! దళి ✽ తారిసైన్య!
ఆదిమధ్యాంతశూన్య! లో ✽ కైకమాన్య!

(పరమేశ్వరుని పాదములపైఁ బడుచున్నాఁడు.)

పర—ఓరీ భీమణా! భయపడకుము. ఆమగువ మామక సాన్నిధ్యమున కరుదెంచి నంతటనే పశ్చాత్తాపముగలిగి నిన్నుఁజంపు ప్రయత్నమును పరిత్యజించి భక్తిపరవశురాలగును. నీవింకఁబొమ్ము.

భీమ—చిత్తము (స్వ) ఏమి? ఆవ్యాఘ్రికి వీరావేశము వోయి భక్త్యావేశము గలుగునా? ఎంతవింత? ఆవింతయేమో చూచిపో యెదఁగాక. (చాటున నిలుచును)

పర—(ఆత్మగతము)

గీ. ఆపగా శాపమున ధాత్రి ✽ నవతరించి
వీరకాంతయై తుదినన్నుఁ ✽ జేరవచ్చు
సుదతియదె లయవేళఁ బ్ర ✽ సుప్తిగాంచి
శక్తిసృష్ట్యాదినఁ జేరు ✽ చాడ్పుగాఁగ

మీనాక్షి—(ప్రవేశించి) అరే! అసార్థక నామధేయ! భీమణదైతేయ! సాహసిక్యముఁగోల్పడి సిగ్గుఁబరిత్యజించి సంగర పరాఙ్ముఖుండఁ వైతివేమిరా? వీరధర్మము వీటఁబుచ్చి ఆహా! వీరధర్మము. నా మాటయేమి? నేను ఖాటించితినా? మామకశాతకృపాణ ఖచితసకలాంగకునిఁ గంతగత ప్రాణునిఁ బొటుఁబోతు దవ ముననబడువిడువాని వెంటాడుట వీరధర్మమా? శూరకర్మమా?

ఏనాఁడెఱుంగనే? ఇట్టి పొరపాటు నాకు నేఁడేల యొదవె? (కలయఁజూచి) ఎంతదవ్వు వచ్చితిని. శరచ్చంద్రికా స్వచ్ఛమిది యేలోకము? ఆహా! కైవల్య లక్ష్మీనివాసము, కాలకంధరుని రాణివాసము కైలాసమిది? హా! సర్వేశ్వరుఁడు నన్నీవిధంబునఁ దన సన్నిధానమునకు రప్పించి తరింపఁ జేయుటకే కాఁబోలు నాకు నేఁడిట్టి పొరపాటు గలుగఁజేసినాడు. ఏమి? మత్పురాకృత పుణ్యకర్మాతిశయము. (పరమేశ్వరునిఁజూచి) హా! హా. వీఁడుగో! సంవర్తసంధ్యాసమయ చండతాండవకేళీ సంరంభ క్షోభిత సకలప్రపంచుఁడు!, ఫాలలోచన ప్రోద్భవ కృశాన జ్వాలా భస్మీకృత సంకల్ప సంభవుఁడు!, విశ్వచతుర్దశ భువన సృజనపాలన విలయకారణుఁడు!, వందారుముని బృందారక మందారము! సర్వేశ్వరుఁడు!

సీ. దారుకావనముని | తరుణీ మనోధన
హర్తవీఁడె లోక | భర్తవీఁడె
సంతత ప్రణవని | స్వనసౌధవీధికా
రతుఁడు వీఁడే వేద | నుతుఁడు వీఁడె
అంధక వ్యాఘ్రభుజ | లంధరపుష్పాస్త్ర
హరుఁడువీఁడే శుభం | కరుఁడువీఁడె
సారవిహీన సం | సారాంధకార భా
స్కరుఁడు వీఁడే జగ | ద్గురుఁడువీఁడె
భవుఁడువీఁడె గోరాజ సైం | ధవుఁడువీఁడె
ఘనుఁడువీఁడె శ్రితార్తి భం | జనుఁడువీఁడె
శూలివీఁడె యోగిమనోబ్జ | హేలివీఁడె
శివుఁడువీఁడె, యస్మత్ప్రాణ | ధవుఁడువీఁడె.

ఆహా! ఏమిమూర్తి? మూర్తిత్రయీ మూలమూర్తి! లావణ్యసుధామయమూర్తి. మధురకృపామూర్తి! మామకమనోహరమూర్తి!

ఈసకలలోకనాథునకు, ఆత్మతో నాశరీర మర్పణముసేసికొని కృతార్థురాల నయ్యెదఁగాక. ఆఁ! నేను సమర్పణము సేసికొన్నచోఁ బాపకర్మురాలనగు నన్నుఁ బరాత్పరుఁడు పరిగ్రహింపవలదా? (వెనుకకుఁ బోయి) అయ్యయ్యో! ఎంతటి కలుషమునఁ గొడిగట్టుచుంటిని? ప్రత్యహంబును పాపంపు సంగరప్రదేశంబుల మెట్టు పాదుఁగాళ్ళతోఁ గైవల్య నిలయమునకు గరళకంఠుని సన్నిధానమునకు నరుగుచుంటినే? ప్రతివీరరుధిర పిపాసాలోలములగు పతితంపుఁ గన్నులతోఁ బరమపవిత్రంబగు పరమేశ్వరు మూర్తిని దిలకింపుచుంటినే? ప్రాణహింసాకరమ్ములగు పాపంపుఁ గరమ్ములతోఁ బావనంబులగు పరాత్పరుని చరణంబుల స్పృశింప సాహసించుచుంటినే? నిరంతరఘోర వీరవిహారలాలసమగు నాహేయంపు టాత్మను, శతసహస్ర మానవహత్యాదోషరాశినిమగ్నంబగు నానీచంపు శరీరమును గరుణామయునకు సర్వసమునకు సమర్పణమొనర్ప నుంకించుచుంటినే? అయిన నీనిర్భాగ్య దేహము తగులవేయుటకేగాని యీశ్వరార్పణము గావించుట కర్హముగాదా? అఖిలేశ్వరు నడిగి తెలిసికొందునా?. ఛీ!ఛీ! ఈరక్తవస్త్రములతో, ఈ భీకర వేషముతో నీశుని కట్టెదుటకుఁ బోయి యేమొగము వెట్టికొని పలుకరింతును? ...............ఆహా! వియద్గంగాప్లావనంబున వివిధకలుషము లడంగునందురుగాదా? ఇప్పుడే చని గంగాప్రవాహంబున రుధిరవస్త్రములతోఁ బాటు నాసకల కలుషములఁ గడిగికొని పరాత్పర పదసన్నిధి కరుదెంచి తదనుగ్రహ పాత్రనగుటకుఁ బ్రయత్నించెదఁగాక. (నిష్క్రమించుచున్నది.)

భీషణ—(ఆత్మగతము) ఆహా! భక్త్యావేశముగాదు. ఈస్థాణునిఁజూచి దీనికి మోహావేశము గలిగినది? ఛీ! ఛీ! యేమిచూచి వలచినట్టిది? ఇట్టి యుక్తాయుక్త విచారశూన్యలు గావుననే సుదతుల మందమతులని పెద్దలు వాకొందురు. ఎంతటివింత?

ఉ. అందముఁ జందముం గలుగు నట్టినన్ వలదంచుఁ ద్రోచి యీ
సుందరి రూపహీను గుణశూన్యు నకించనునిన్ వరించె, నే

మందునఁ బీనిభాగ్యము? ల తాంగుల మెప్పొనరున్ గతంబుగా
దందముఁ జెందమున్—నిజము నారయఁ బూరుషు నెత్తిగీఁతయే.

అంతవలచి యాకాంత మీఁదఁబడుటకు సిద్ధపడిరాఁగా నీస్థాణుఁడు పడుకటింటిలోనికి భార్యవచ్చునప్పటికి నిదురవోవు నిర్భాగ్యుని చందమున ధ్యానపుఁగునికిపాట్లు పడనారంభించినాఁడు. రమణీమణుల కిట్టిరసికచక్రవర్తులే నచ్చెదరు గాఁబోలు? (ఆలోచించుటనభినయించి) కానీ! మంచియాలోచనము స్ఫురించినది. ఇది మందాకినిలో స్నానమాడి రాఁబోయినదిగదా! ఆచెలువ వచ్చునప్పటికి నేను మాయాప్రభావంబున నీశివుని రూపముదాల్చి మార్గముననే దాని నెదుర్కొని మద్వశంవదం జేసికొని మదభీష్టము నెఱవేర్చుకొనెదఁ గాక. నేను నాకార్యము గట్టెకించుకొనుదాఁక నీదేవయ్య యిట్లే ధ్యానమగ్నుఁడై యుండుఁగాక. (నిష్క్రమించుచున్నాఁడు.)

పర—కుసుమశరశరావిద్ధహృదయుఁడగు నీదుర్మార్గుఁడు మదాకృతి వహించి యామించుఁబోఁడిని వంచింప నూహించుచున్నాఁడు తిరిగి దురాలోచనమునకు దొరఁకొనుచున్నాఁడు. తానొకటి తలంచిన దైవమొకటి తలంచు ననుటమఱచినాఁడు.

చ. తనమది నింకపై జరుగు దాని నెఱుంగఁగ లేక యుల్లదే!
వనిత సురాపగన్ మునిఁగి వచ్చుచునున్నది నన్నుఁ జేరఁగన్
దనమది నింకపై జరుగు దాని నెఱుంగఁగ లేకవాఁడుగో!
దనుజుఁడు మామకాకృతిని దాలిచి కొమ్మనెదుర్కొనన్ జనున్.

(యవనికజాఱును)

## పంచమరంగము.

—०❀०—

(ప్రవేశము—కైలాసగిరి సమీపమున జంబుకాస్యుఁడు.

అయ్యయ్యో! భగవంతుఁడా! మహారాజును దరుముకొని మహామారిమీనాక్షి కైలాసపర్వత మీఁదికేఁగియెంతో తడవైనదే!

ఇంతకు ఱేఁడు క్రిందికి రాఁడయ్యెనేమి? ఆఘాత మాకొంచెము పనిఁ గావించినదేమొ? అదియైన దిగిరావలదా? (పైకిఁ బరికించి) ఆహా! ఆపిశాచి వియత్పథము నుండి పావురముఁ బోలెఁ గ్రిందికి దిగుచున్నది. ఇది పైకేల పోయినది. దీనివస్త్రము లింతకు రుధిరమయములై యుండెనే! ఇప్పుడు పరిశుభ్రముగా నున్న వేమి? అక్కటక్కటా! ఈశాకిని దానవ నాయకుని ప్రాణము లపహరించి తత్పాప పరిహారార్థము గంగాప్లవనంబొనర్చి రక్తపుఁబుట్టముల నుదికికొని వచ్చుచున్నట్లున్నది. దేవుఁడా! ఇంక మా ప్రభుఁడు బ్రతికివచ్చుట వట్టిదే. నాకుఁ బదివేల టంకముల నిచ్చుట వట్టిదే. పదివేలటంకముల నేఁదీసికొనిపోక వట్టి చేతులతోఁ బోయిన నేఁజచ్చినయెడల నాప్రియసఖి శశిముఖముండ మోయుటవట్టిదే. నేను మరణించి నంతట నదిముండమోయక గాజులు పగులఁగొట్టికొనక పుస్తెను ద్రెంచుకొనక బొట్టును దుడుచుకొనక నిత్యసువాసీత్వము ననుభవించు చున్నయెడల, నేను, మానధనుండనగు నేను గన్నులతోఁ జూచి మనియుండుట వట్టిదే. అయ్యో! దేవుఁడా! తుదకంతయు వట్టిదే. అదిగో! మృత్యుదేవత మీనాక్షి యిటేవచ్చుచున్నది. ఇది నన్నుఁ జూచిన నేనిచ్చటనే చావవలసి వచ్చును. ఇచ్చటఁ జచ్చిన యెడల నచ్చట శశిముఖి ముండమోయునో మోయదో యెవరు చూతురు? ఎవరైనఁ జూచిచెప్పిన యెడల మాత్రము నేనెట్లునమ్మెదను? అదిగాక యీపాపంపుఁ గాలములో బ్రదికి యున్న వారితోడనే సత్యముఁ జెప్పరు. చచ్చిన వానితో నెవరు చెప్పెదరు. కావున నింటికిఁ బోయెదను.

(నిష్క్రమించుచున్నాఁడు)

(మీనాక్షి ప్రవేశించుచున్నది)

ఆహా! గగనగంగాతరంగిణీ ప్లావనంబొనర్చి మామక దేహమును పావన మొనర్చుకొంటిని. పరమేశ్వరుఁడిప్పుడు నన్నుఁ బరిగ్రహించునా? నిజచరణసేవ నీదాసి కనుగ్రహించునా?.....ఆహా నాశ్రుతిపుటంబులకు "అమ్మా! నీవుపూర్వజన్మంబునఁ బార్వతీదేవివి. మందా

కనీ శాపంబునం జేసి మీనాక్షివై జన్మించి మర్త్యత్వంబనుభవించితివి. నీవు నేఁడు శాపవిమోచితురాలవై పరాత్పరానుగ్రహపాత్రవయ్యె దవు. సందేహింపక స్వామిసన్నిధికిఁ బొమ్మని యెవరో కంటికిఁగానరాక పలుకు చున్నట్లు వినఁబడు చున్న దేమి? ఏమిది. మహాదేవ చరణభక్తులు ప్రమథవీరులు నన్నుఁజూచి దేశాంతరమున కేఁగి పెద్దకాలమునకుఁ దిరిగివచ్చిన కన్నతల్లిఁజూచి సంతోషించు చిన్నిబిడ్డల చందంబునఁ బట్టరాని యానందమున గంతులిడుచు పాగిలఁబడి నమస్కరించుచు న్నారు. నేనునిశ్చయముగఁ బ్రాలేయాచల పుత్త్రికి! చీ! చీ! యెట్లగు దును? మలయధ్వజుని కుమారినిగానా? ఇప్పటి కొకగడియ క్రిందటి వఱకుఁ బ్రాణిహింసా పరత్వమున మెలంగిన పాపకర్మురాలనుగానా? అయ్యో! ఇట్టిపాపాత్మురాలుఁ గఠినకర్మురాలు పాపదూరునకుఁ బరమ కరుణావశంవదునకు భగవంతునకు నిల్లాలుకాను. సేవకురాలు మాత్రమెట్లుగాఁగలదు? ఇట్లూరక హృదయాటవిని శంకాదావపావ కమున దహించు కొననేల? చంద్రశేఖర చరణ సాన్నిధ్యమున కుంజని నాభాగ్యాభాగ్యములఁ బరిశీలించు కొనెదఁగాక.

సీ. అఖిలలోకేశున కావాసమగుటకు
రజతాద్రి పట్టిన వ్రతమదేమొ?
అర్ధేందు మకుటున కాభరణములుగాఁ
బాములునోఁచిన నోమదేమొ?
శ్రీమహేశుని మేన శ్రీగంధమగుటకు
భూతి గావించిన పుణ్యమేమొ?
కాల కంధరునకుఁ గట్టఁ బుట్టముగాఁగ
ద్విపచర్మ మొనరించు తపమదేమొ?

గీ. అహరహంబు నీశునకు వాహనముగాఁగఁ
బసరము పొనర్చినట్టి జపంబదేమొ?

భర్గుచరణ సన్నిధియందుఁ । బాయకుండఁ
బ్రమథగణములు సేసిన । భాగ్యమేమొ?

[నిష్క్రమించుచున్నది.]

షష్ఠరంగము.

ప్రదేశము — కైలాసము

(ప్రవేశము శివునిరూపుతో భీమనుఁడు.)

భీమ — భళీ! ఇప్పుడు నన్ను నిశ్చయముగఁ బార్వతీదేవి చూచినను బరమేశ్వరుఁ డనియే భ్రమింపఁ గలదు! మీనాక్షి మాట యేమి? ఈప్రదేశముగూడ నచ్చముగ శివుఁడు యోగసమాధి నవధరించుచున్న ప్రదేశము వలెనేయున్నది ఇంక నాయభీష్టము తప్పక సమకూరఁగలదు భర్గుఁడున్న ప్రదేశమున కీస్థలమును దాఁటియే పోవలయును గావున మీనాక్షి యిచ్చటకు తప్పక రాఁగలదు. వచ్చి నావలలోఁ బడఁగలదు.

సీ. ఆకాంత నాచేత । కరుగుదెంచినయంతఁ
జీరియంకాసీనఁ । జేయువాఁడ
చేసి, యాకామిని । చిన్నిముంగురుల మృ
దులలీలఁ గొనగోట । దువ్వువాఁడ
దువ్వి, యాపూఁబోఁడి । తోరంపుఁ జెక్కుల
నల్లనల్లనముద్దు । లాడువాఁడ
ఆడి, యాయబ్జాయ । తాక్షి పైఁటచెఱంగు
దొలఁగించి పాలిండ్లఁ । బులుమువాఁడ

గీ॥ పులిమి యారామపరవశం । జలిపి, విరుల
సెజ్జఁగల్పించి సెజ్జపైఁ । జేర్చువాఁడ
చేర్చి, మన్మథు దుర్గర్వ । మార్చువాఁడ
ఆర్చి, స్వర్గసౌఖ్యము నేఁడ । యందువాఁడ.

ఆహా! ఆహా! అదిగో! అదిగో! ఆమదమాతంగగమన నా యదృష్టదేవత వచ్చుచున్నది. ఇది వచ్చునప్పటికి యోగసమాధి నవధరించుచున్నట్లభినయించెద. పిమ్మట నీని ప్రార్థన త్రోసివేయలేని లాగున నటించి తుదకు నామనోరథము నెఱవేర్చుకొనెద.

(యోగసమాధి నవధరించుచున్నట్లు నటించుచున్నాఁడు)

మీనా—(ప్రవేశించి చేతులుమోడ్చి) శంకరా! పాదభక్త పాప పరంపరాసంహారకారణా! ఈ పాపాత్మురాలిపైఁ దావక కృపాదృష్టిఁ బఱపి పవిత్రురాలిం గావింపుము. (సాఁగిలఁబడి నమస్కరించుచున్నది)

భీమ—(ఆత్మగతము) ఈకుసుమకోమల లేవనెత్తి కౌఁగిటఁ జేర్చుగునా? తొందరపడిన కార్యము చెడునేమో! పోనీ పలుకుదునా? వలదు. వలదు. ఇంకఁగొంతతడవు బిగిసికొని కూర్చుండ వల యును.

మీన—(లేచి) పరమేశ్వరా!

ఉ. ఆలముసేయఁ బుట్టినఁకి యర్కు జరియించితిఁ, ఘోరహత్యలన్
జాలయొనర్చితిన్, సతము స్నానమొనర్చితి నిత్యశేఖులన్
జాలిని నాయఘంబుడిపి సమ్మతి నన్నుఁ బరిగ్రహింపవే
హాలహాలమ్ము గొన్నగతి నార్తజనావన! లోకపావనా!

భీమ—ఓకాంతాశిరోమణీ! ఓభక్తురాలా! అవ్యంబగు నీస్తోత్రంబునకు మెచ్చితి. నీయభీష్ట వరపరంపరల ననుగ్రహించెదఁ గోరు కొనుము.

మీనా—(ఆత్మగతము) ఆహా! పరమేశ్వరుఁ డెంతలోఁ బ్రసన్నుఁ డైనాఁడు. ఏమి నాభాగ్యము? (ప్ర) జగదీశ్వరా!

సీ. అనయమ్ము నీరూపు నరయునట్టివరమ్ముఁ
గరుణింపఁ గదవెనా కన్నులకును

ఏవేళనీపద । సేవఁ బొనర్చెడు
వరమీయఁ గదవెనా । కరములకును
ఏప్రొద్దు నిన్నుతి । యించువరము దయ
సేయంగఁ గదవెనా । జిహ్వకకను
ఏయెడనీమూర్తి । నెడఁ బాయని వరమ్ముఁ
గృపసేయఁ గదవెనా । హృదయమునకు

గీ. అఖిల మయ్యుఁడ వైనట్టి నీ । యందు నైక్య
మీయఁగదవె కరుణ నాదు । కాయమునకు
సంశ్రితార్తి హరణలోల! । సత్యశీల!
కాలకాల! సమస్తది । క్పాలపాల!

భీష — ఓసుందరీ! నీకోరినవరంబు లన్నియుఁ గరుణించితి. నిన్ను నాపట్టమహిషిగా నంగీకరించితిని రమ్ము, నాకౌఁగిటఁ జేరు కొమ్ము. (చేతులు చాఁచుచున్నాఁడు. లజ్జతో మీనాక్షి తలవంచికొని నిలుచుచున్నది. భీషణుఁడు లేచి చేతులు చాఁచుచుఁ గౌఁగిలింపఁబోవుచుండ నిరువురి నడుమఁబరమేశ్వరుఁడు సాక్షాత్కరించి భీషణుని శిరమున నెడమకాలువెట్టి పాతాళమునకడఁచుచు మీనాక్షికరముగ్రహించుచున్నాఁడు. యవనిక జాఱును)



# శివలీల.

## చతుర్థాంకము.

### ప్రథమ రంగము.

మధురాపురమున శివశర్మ మందిరము.

ప్రవే—శివశర్మ—సర్వమంగళ—గుణవతి.

శివ—దేవీ! సర్వమంగళ! చూడుము. భస్మోద్ధూళిత సర్వావయవులు రుద్రాక్ష మాలికాలంకృతులు పరమ శైవశిఖామణులు పార్వతీపరమేశ్వర దివ్యకల్యాణ మహోత్సవమునకు హిమశైలమునకుఁ బోవు ప్రమథవీరులభంగి బారులుగట్టి కాశీయాత్రకెట్లు పోవుచున్నారో? ఆహా! వీరిభాగ్యము? శితికంధర ప్రసాదంబునఁ బ్రతిబంధమ్ములు లేమిగదా వీరు తీర్థయాత్ర కరుగుచున్నారు? ఓకల్యాణీ!

గీ. అడుగుఁదమ్ముల సత్తువ యుడుగనపుడె
వనిత! కాశికిఁబోవంగ వలయు నరుఁడు
కన్నుదోయికినింబార గప్పనపుడె
సుదతి! శ్రీవిశ్వనాయకుఁ జూడవలయు.

ఏమన?

గీ. ఇపుడు కాశికాయాత్రకు నేఁగువారె
అపుడు కైలాసశిఖరికి నరుగువారు
కలికి! విశ్వనాథుని నిందు గాంచువారె
అందు నంబికావల్లభు నరయువారు.

సర్వ—ప్రాణనాథా! అట్లనియెఱిఁగియు మనమిప్పుడు కాశీయాత్ర కేల పోఁగూడదు.

శివ—ప్రతిబంధ మొకటి యున్నదిగదా?

సర్వ—శివపూజయా!

శివ—దేవీ! సత్యము, దయ, శాంతి, సమత, శివపూజ మున్నుగాఁ గలవి మానసములగు తీర్థములు, అన్నిటిలో శివపూజ, మిన్నయైనది.

గీ. కిసలయోష్ఠి! కైవల్య లక్ష్మీప్రదములు
మానసములైన తీర్థముల్, మానవుండు
బాహ్యతీర్థములాడిన ఫలము లేదు
మానసములఁ దీర్థములనే మఱునయేని.

మనము కాశీయాత్రికుఁ బోయినచో నిరంతర శివపూజకు భంగము గలుగవలసినదే కాదా? నిన్నందులకు నియమించి కాశీయాత్రకు నేనేఁగుదుననుకొన్న నాకన్న నీకుఁదీర్థయాత్రాసక్తి యధికము. అట్టి నిన్నువిడిచిపోవుటకు నామనసంగీకరింపదు. మఱి మనమిరువురముఁబోయినచో వ్రతభంగము.

గుణ—నాయనా! మీరిరువురుఁ గాశీయాత్రకుఁ బోయినమాత్రము వ్రతమేల భంగమగును? నేను లేనా?

శివ—అమ్మా! గుణవతీ! నీవుపసిబిడ్డవుగదా? నీచేతనేమగునమ్మా.

గుణ—ఏమి తండ్రీ! పసిబిడ్డనయినంతమాత్రమున నేనంత చేఁతగానిదాన ననుకొనుచుంటిరా? గృహకృత్యముల నన్నిటిని నేనే నిర్వహించుచుంటినిగాదా? అమ్మనొకపనినైన ముట్టుకొననిచ్చుచుంటినా? ఇల్లు వాకిలి శుభ్రపఱచుటలో వంటసేయుటలో నతిథిపూజ గావించుటలో నలుసంత లోపము సేయుచుంటినా? ఇదిగాక నీవుగాని మాయమ్మగాని ప్రతిదినము మహాదేవుని కర్పింపఁగొనిపోవు పాలను నాచేతులతోఁ బిదికి

ప్రొయిమీఁదఁబెట్టి మరుగంగఁగాఁచి కుంచెతోఁ గొలిచి నేను గాదా యిచ్చునది. అమ్మా! అవునుగాఁడా?

సర్వ—అవునమ్మా! నీచేతితీరుగాఁబోలు? విశ్వేశ్వరుఁడు మీఁగుణవతి చేతులతోఁ బిదికి మరుగఁగాఁచియిచ్చినపాలు మిక్కిలి మధురముగా నుండునని తనివిదీఱఁ ద్రావుచుండును.

గుణ—(సంతోషముతో) నాయనా! వింటివా? వింటివా? పాలు పిండి మరుగఁగాఁచి యిచ్చినందులకే మహాదేవుఁడు దానింత సంతోషించుచుండెనఁట. మఱి నేనే సమర్పించినచో మఱింత సంతసముతోఁ ద్రాఁగఁడా?

శివ—అమ్మా! నీవందులకసమర్థవసి నాతలంపుగాదు. పదియేఁడులైనరాని పసిపాపవుగదా? ఒకనాఁడు పొరపాటునఁ బరమేశ్వరునకుఁ గుంచెడుపాలు సమర్పించుటలో నెట్టిలోపము జరిగినను బిత్రుపైతామహంబైన వ్రతము భంగమగును. వీరశైవాచారము మహాఘోరమైనది. ఇటువినుము. వ్రతవిధానము.

సీ. ప్రత్యూదయముఁ గాల । కృత్యంబులందీర్చి
ధౌతవస్త్రంబులు । దాల్చి, నిమ్మఁ
గుంచెడు కపిలంపు । గోవుపాలను బిండి
కమ్మఁగా మీఁగడఁ । గట్టఁగాఁచి
హేమపాత్రమ్మున । నిడుకొని పరిశుభ్ర
వస్త్రమ్ముపైఁగప్పి । పదిలముగను
భవునకు నర్పింప । వలయును మనయింటి
వారు పురుషులైన । వనితలైన.

గీ. ఇందునేమఱిపాటనే । మేనిలోప
మగునయేనియు సకుటుంబ । ముగను నేను
భగ్గు భగ్గున మండెను । నగ్గిలోన
భర్గచరణ సన్నిధిఁగూల । వలయుఁదల్లి.

గుణ—తండ్రీ! ఈమాత్రపుఁ బనిలో నేనుఁ బొరపడుదునా? పాలు పిండుటలో పొరపడు చుంటినా? కమ్మఁగాఁ గాఁచుటలోఁ బొరపడుచుంటినా? కుంచెతోఁ గొల్పుటలోఁ బొరపడు చుంటినా? అతిథి సత్కార మొనర్పుటలో నింకనితరగృహ కార్యముల నిర్వర్తించుటలోఁ బొరపడు చుంటినా? ఇందుఁ బొరపడుదునా? నాయనా! నీకెందులకు సందేహము! మీరు వచ్చువఱకు శ్రద్ధా భక్తులతో నేనీవ్రతము నిర్వహింతును. నీవునమ్మయు నిశ్చింతతోఁ గాశీయాత్రకుఁ బోయి విశ్వనాయకుని దర్శించిరండు.

శివ—దేవీ! మనయనుఁగు బిడ్డపలుకులు వినఁగొలఁది నామనంబున నాఁపరాకయున్న కాశికా యాత్రాసక్తి మఱింత యధికమగు చున్నది నీయభిప్రాయమేమి?

సర్వ—మనగుణవతి వ్రతము నిర్విఘ్నముగా నెఱవేర్పఁ గలదనియే నావిశ్వాసము.

శివ—నాకు నట్టి నమ్మకమే యున్నది.

గుణ—తల్లిదండ్రులారా! శంకింపకుఁడు. తప్పక కాశీయాత్రకుఁ బోయిరండు.

శివ—అమ్మా! అటులే పోయివత్తుము. దేవీ! రేపే ప్రయాణము.

సర్వ—చిత్తము.

గుణ—జననీజనకులారా! మీరు తీర్థయాత్రకుఁ బోయెదరుగదా? వచ్చునప్పుడు నాకేమి గొనివత్తురు.

శివ—పండ్లును మిఠాయియుఁ గొనివత్తుమా?

గుణ—అవి తెచ్చినయిష్టమే. తేకున్న నిష్టమే. కాని నాకుఁ దప్పకుండ మీరుగొని రావలసిన వేమనఁ గాశీక్షేత్రపటము. విశా

లాక్షీ విశ్వేశ్వరులపటము. ఢుంఠివినాయకుని బొమ్మ. కాల భైరవుని బొమ్మ.

శివ—కుమారీ? తప్పక కొనివత్తుము. కాని కడుమెలఁకువతో వ్రతము నిర్వర్తింప వలయుఁజుమా?

గుణ—తండ్రీ! ఏమియు శంకింపవలదు.

శివ—ఇప్పటినుండియే ప్రయాణ సన్నాహము గావించు కొనవల యును. రండు.

(నిష్క్రమింతురు.)

ద్వితీయరంగము.

ప్రదేశము—శివాలయమున గర్భమంటపము.

(ప్రవేశము-క్షీరపాత్రముతో గుణవతి-పాట)

గుణ—(క్షీరపాత్రము స్వామిసన్నిధినిడి వెనుకకు వచ్చి మఱుఁగునఁ గొంతతడవునిల్చి) ఏమిది? దేవుఁడు పాలుద్రావినట్లు లేదే? గుటకలువెట్టిన చప్పుడువినిపింపదే? మామేనత్తకొడుకు వంట యింటిలోఁబాలు దాగివునట్టు లీతఁడుగూడ సవ్వడిగాకుండ క్షీరము మ్రింగుటలో నేర్పరియేమో? ఇప్పటికారగించి యుం డును. (వచ్చి పాత్రముఁ దిలకించి) అక్కటకట! స్వామి పాలనంటనేలేదు. ఏమిశివుఁడా! ఎందులకారగింపవైతివీక్షీరము? నాతల్లిదండ్రులర్పించినట్లుగాక యేదైన లోపముగావించితినా?

సీ. పాలుగాఁగవటంచుఁ జి గోరిలవో? మఱుఁగంగఁ
గాఁచితి మీగడ జి గట్టెనిదిగో?
ఆఱిపోయినవంచు జి నంగీకరింపవో?
తాఁకిచూడుము వేఁడి ♦ తగ్గదింక
నీళ్ళుగలసెనంచు జి నొల్లవో? పరికింపు
మింద యీపాల చి జి క్కందనమ్ము

తక్కువయ్యెనటంచుఁ ద్రాగవో? కుంచెడు
గొలిచితెచ్చితిఁ గొల్చి కొమ్మపోని!

గీ. ఏనుదుగ్ధమ్ముదే నెవ్వ రేనిఁ జూడ
దృష్టిదోషము దగిలెనం చెంచితేమొ?
పదిలముగఁ బాత్రపై నాదు పైఁటచెఱఁగు
గప్పితెచ్చితినప్ప! మా యప్పతోడు!

సందేహింపకుము. ఆరగింపుము! స్వామీ! ఆరగింపుము. అయ్యో! మిన్నకుంటివేమి? త్రాగవేమి? దేవుఁడా! పట్టిపాలు సవ్వగా నుండునని శంకించుచుంటివా? తీయని యావుపాలుగదయ్యా! నీకుఁ గూడ మామేనబావకుఁబలెఁ బంచదారలేనిది పాలుమ్రింగుడువడవా యేమి? అబ్బ! ఇన్నిరుచులు గావలసినవాఁడవు విసమెట్లు మ్రింగితి వయ్యా! పోనీలెమ్ము. ఒకవేళ నీవిట్లని మంకుసేయుదువేమోయని నేనుమొదటనే యోజించుకొని యీచక్కెరపొట్లము తెచ్చితిని. (పైఁటచెఱఁగుననున్న చక్కెరపొట్లము విప్పుచు) శివుఁడా! నాకు క్షీరములోనికిఁ జక్కెరగావలయునని ముందేచెప్పఁగూడదా! నన్నిట్లి బ్బంది పెట్టుటయెందులకు? నీకుఁ గావలసినది నీవడుగకున్న నాకెట్లు తెలియఁగలదు? అమ్మయైన నడుగనిది పెట్టదుగదా? ఇదిగోఁ? బంచ దార పాలలో వేయుదునా? చాలునా? ఇంకఁగొంచెము- ఇంకఁగొం చెము- ఊ! అంతయువేసితిని. ఊ- కానీమఱి. ఇదిగోఁ! గన్నులు మూసికొనుచుంటిని- పదియొంట్లు లెక్కిడు వఱకు నొక్కచుక్క లేకుండ నీపాల నన్నిటిం ద్రాగవలయును. ఊ- ఒకటి- రెండు. మూఁడు. నాలుగు. అయిదు- ఆరు- ఏడు ఎనిమిది- తొమ్మిది- ప—ది. (కన్నులుదెఱచి) ఏమి? దేవుఁడా! త్రావనేలేదేమి? త్రాగ వేమి? అక్కటా! చల్లబడి పోవుచున్నవయ్యా? చల్లవడినచోఁ జవులు దప్పినవని తిరుగనన్ను మిడికించుటకా యూరకుంటివి? శివుఁడా! త్రాగు, మానాయనకాని త్రాగు. మాయమ్మకాని త్రాగు. అయ్యో!

మిన్నకుందు వేమి? మాయయ్యా యారగింపవయ్యా! నీకడుపునఁ బుట్టిద నయ్యా! నీపదములఁ బట్టుకొనెదనయ్యా! నీకేల జాలికలుగుట లేదయ్యా! పసిబిడ్డను నన్ను దిప్పలు వెట్టుట నీకు ధర్మము గాదయ్యా!

ఉ. అంచితు లమ్మయయ్యయును దీర్థయాత్రకుఁ బోవుచు నీకునిచ్చ లు
గుంచెడు పాలొసంగుమనఁ గూరిమి నొప్పితి నీవుమంకువం
చెంచక, బుద్ధివచ్చి, నిఁక నిందుల కొప్పుడు నొప్పు, వారలే
తెంచెడుదాఁక స్వామి! నను దిప్పలు వెట్టక పాలుద్రావవే?

ఇదిగో! శివుఁడా? నీవీక్షీరము మాఱుమాటాడకుండఁ గ్రోలితివా తరువాత నీకు మంచితోయముఁ బెట్టుదును. నాతల్లిదండ్రులు తీర్థయాత్రకుఁ బోవుచు వారువచ్చువఱకు నేనుదినుటకుఁ గావలసినంత పటికిబెల్లము గావలసినన్ని చక్కిలములు నా మందసమునిండఁ బెట్టిపోయినారు. నీవీదుగ్ధ మానితివా వానిలోఁ గొన్నింటిఁగాని కావలసినచో నన్నింటింగాని నీకుఁదెచ్చియిత్తును. ఇదిగాక మావారు తీర్థయాత్రకుఁ బోయిరిగదా! వారువచ్చునప్పుడు నాకొఱకు వింతవింతలబొమ్మలు రకరకములపండ్లు తీరుతీరుల మిఠాయీలు గొనితెత్తురు. అవియన్నియు నీకేయిచ్చెదను. నీయాన! నాయాన! మాతల్లిదండ్రుల యాన. నామాటలు విశ్వసింపుము. ఆరగింపుము. క్షీరమారగింపుము. అయ్యో! అయ్యో!

ఏమి దేవుఁడా! నేనుబ్రతిమిలాడిన కొలందియు నీవుపైకిఁ బోవుచుంటివా? మంచిది. వలదా? పాలువలదా? మొదటికి మోసమువచ్చునుజుమా? నన్నుఁద్రాగుమందువా? నీవారగింపనిచో నాకేమి? నీకడుపేడ్చినచో నాకడుపేడ్చునా? ఎంతతడవో పట్టదుసుమా? గుటుకున మ్రింగివైచెదను. అప్పుడునీవు పాలుపాలని పలువరించినను లాభముండదుసుమా? త్రాగు. ఇప్పటికైనబుద్ధి తెచ్చుకొని త్రాగు. ఊఁహూఁ! నీనోటిలో శివియున్నప్పుడు నీవెందులకుఁ ద్రాగుదువు ఇదిగో. ఇదిగో. ద్రాగుచుంటిని. త్రాగుచుంటిని. త్రాగుచుంటిని.

అబ్బబ్బ! ఇది యెక్కడిపెంకెతనము? నాప్రాణము విసిగిపోవు చున్నది. ఓశివుఁడా! నీకీనాఁడు నాదురదృష్టవశమున నాఁకలియగుట లేదా యేమయ్యా! పోనిమ్ము. సగము. లేసిచో, నాలుగవవంతు. తుదకొకగ్రుక్కెఁడైనఁ ద్రావి వదలివేయవయ్యా! అయ్యో! అయ్యో! త్రాగవయ్యా! దేవుఁడా! నీవిదివఱకు నా జననీజనకులఁగూడ నిట్లే యేడ్పించువాఁడవా? నాకర్మమే నా? వారన్నఁ బెద్దవారుగావున నీవెన్ని తిప్పలుపెట్టినను పడియుందురు. నేను జిన్నదాననుగదా? కష్టమను నది యెఱుఁగనిదాననుగదా? నన్నుఁగూడ నట్లే యిబ్బందిపెట్టవల యునా? దేవుఁడా! కరుణామయుఁడవగు నోదేవుఁడా! త్రాగుము. పాలుద్రాగుము.

అయ్యయ్యో! ఎంతబెదరించినను, ఎంతగా మొత్తుకొన్నను, ఎంతబ్రతిమిలాడుకొన్నను, శిల్లముగొట్టిన రాయివలెఁ గదలక మెదలక నోరువిప్పిమాటాడక యూరక చూచెదవేమయ్యా! పసికందునగు నన్నిట్లు వలవలయేడ్పించుటయే నీకు న్యాయముగాఁ దోఁచినదా? నీకుఁ గారుణ్యము గలుగుట లేదా? నీహృదయము రాయా? ఇనుమా? వజ్రమా?

ఓశివుఁడా! నిరంతరము నాజనయిత్రిగాని నాజనకుండుగాని నీకు సమర్పింపఁదెచ్చు కుంచెడుపాలు సంతోషముతోఁ ద్రావెడు నీవు, నేఁడు నేను దెచ్చిన క్షీరము ముట్టకుండుటంజూడ నాదురదృష్ట వశమున నీదుగ్ధము నేను గొనివచ్చి నీకునర్పించు విధానమున నెందో నావలన నొకపొరపాటు జరిగియుండునని నేను విశ్వసించుచుంటిని. కానిచోఁ బరమకృపానిలయుండవగు నీకుఁ బసిపాపపైఁ బగయుండునా? పాలుగ్రోలకుందువా? తప్పక వ్రతవిధానమున నేదో నిర్భాగ్యురాల నగునావలన గొప్పలోపము గలిగినది. కాననే నీవుప్రసన్నుఁడవుగా నైతివి.

అక్కటక్కటా! వ్రతవినాశనము! వంశవినాశనము! వ్రతభంగమైనచో మాకుటుంబములోని వారంద ఱగ్నిగుండమునఁ గూలవలయునుగదా? అయ్యయ్యో! నాతండ్రి "అమ్మా! వీరశైవవ్రతము మహాఘోరమైనది. నినుబోఁటి పసిబిడ్డలు సేయఁగలరా? వలదువల" దని చెప్పినమాటలు పెడచెవిఁబెట్టి చేఁతగాని డంబములువలికి జననీజనకుల గాశికిఁబంపి వ్రతభంగము గావించి వంశాంతముసేసితినే. అయ్యో! పాపకర్మురాలను నేనుబుట్టి పరమపవిత్రంబగు నొకబ్రాహ్మణ కుటుంబమును వహ్నికుండముపాలుగావించితినే! తప్పదు. వంశాంతము తప్పదు.

ఇట్టి పాపకర్మురాలను నేనుబ్రతికియెందులకు? బ్రతికియుండి నాతలిదండ్రుల మొగము లెట్లుచూతును? ఏమని వారితోఁ జెప్పుదును? అప్పుడుమాత్రము నాకు ఘోరమరణము దప్పునా? మాకుటుంబ నాశనముగాకతప్పునా? తప్పదు. మాయందఱికి మరణము దప్పదు. ఓస్వామీ! ఓకరుణానిలయా!

సీ. వారణాసికిఁబోయి వచ్చినపైఁదండ్రి
        యెఱుఁగకుండఁదు వ్రతం బిట్లుఁగుట
ఘోరశైవాచార వీరుఁడాతఁడెఱింగి
        వ్రతసమయంబును బాయఁబోఁడు
పాయక, వంశవి ధ్వంసమ్మగుటకగ్ని
        గుండమ్ముఁ ద్రవ్వింప కుండఁడెట్లు
త్రవ్వించి మొదటనే వ్రతముఁజెడ్డిన నన్ను
        బసిమిద్రోయక దయఁ దలఁపఁబోఁడు

గీ. చావు నిజమెట్లునా, కట్లు చావనేల?
పాపపుణ్యముల్ నీతల పైనిఁబెట్టి
తావకీనచరణసన్ని ధానమంద
తలఁబగులఁగొట్టుకొని ప్రాణ ములఁద్యజింతు.

హరహర! మహాదేవ! మహాదేవ!

(తలఁబగులఁగొట్టుకొనఁబోవుచున్నది)

(పరమేశ్వరుఁడు సాక్షాత్కరించుచున్నాఁడు)

పర—(గుణవతిని బట్టికొని) ఆఁగుము! గుణవతీ! ఆఁగుము.

గుణ—ముందు పాలుద్రాగుము.

పర—ఇదిగోఁ (ద్రాగుచుంటిని. త్రాగుచున్నాఁడు)

గుణ—(చూచుచు సంతోషపడుచున్నది) పాలన్నియుఁ గ్రోలితివా? మిగిల్చితివా?

పర—లేదన్నియుఁద్రావితిని.

గుణ—అబ్బ! ఎంత పెంకెదేవుఁడవు?

పర—నాపెంకెతనముకన్న నెక్కువ మంకుతనమేచూపించితివిగదా? మేలు! గుణవతీ! మేలు!

గీ. చిన్నిసుతు నయభయములఁ గన్నతల్లి
యుగ్గుఁబాలను ద్రావించు నోజగాఁగ
అలికమునఁ గన్నుఁగలవాని నదరఁజేసి
పాలుద్రావించితివి బళీ! బాలశక్తి!

గుణవతీ! యెంతటి నెఱజాణవు. విషకంఠు నింతలో క్షీరకంఠుని గావించితివే?

గీ. అమరులును దైత్యులునుగూడి యర్థివేఁడ
నాఁడువిషకంఠుఁగాపించి నారునన్ను
పిన్నపాప వొక్కతెవ వశా బెదరఁగొట్టి
నీవు క్షీరకంఠునిఁజేసి నావునేఁడు.

(సంతోషముతోఁ జేయిఁబట్టుకొనఁబోవుచున్నాఁడు)

గుణ—ఆఁ! ఆఁ! ఆఁ! భయమగుచున్నది. దూరముగానుండుము.

పర—ఏమి?

గుణ—అమ్మబాబూ! అప్పటినుండియుఁ దిప్పలువెట్టి నీవిప్పుడు క్షీర మానుటచేఁ గడుపునిండినట్లుండి, ఆనందమున మేనుమఱచి నిన్ను సరిగాఁ బరికింపకుంటిని. అబ్బ! బుస్సు బుస్సు మను చున్నవి పాములు.

పర—అవి నీజోలికిరావు.

గుణ—నేను దూరముగానుంటినిగనుక నవినాజోలికిరావు. ఒకవేళ వచ్చినను దూరముగానుంటినిగనుకఁ బరుగెత్తెదను. నామాట కేమిగాని మఱి నీవు శరీరముననే తాల్చితివే! ఆచిలువలు నిన్నుఁగఱవవా?

పర—కఱవవు.

గుణ—ఎందుచేత? నీయొద్ద మంత్రమున్నదా?

పర—ఊఁ.

గుణ—అబ్బ! మాంత్రికుఁడవుగూడనా? అయినమాత్రమేమి! మంత్రము వచ్చునుగదాయని నిన్ను పాముల ధరింపుమన్నారా యేమి? ఒకానొకప్పుడు నిద్రించినప్పుడు నీవు మంత్రము మఱచిపోవచ్చును. అప్పుడపాయము గలుగఁ గూడదా? వలదు. వానిదీసివేయుము.

పర—అవినాకు భూషణములుగదా?

గుణ—భూషణములా! ఓవెఱ్ఱిదేవుఁడా! నీకంత నగలమీఁద మక్కువ యున్నచో నిదిగో! నామేననున్న నగలన్నియు నిచ్చెదఁ గైకొనుము. వానిందీసివేయుము.

పర—అక్కఱలేదు. కాని నీకు నేనువీనిందాల్చియున్న నేమికష్టము?

గుణ—ఏమికష్టమా? ఒకవేళ నాదుష్టభుజంగములు గఱచిన నీవు ప్రాణములఁ గోల్పోవవలసివచ్చునుగాదా? అప్పుడు పాల నెవ్వరు దాగ్రుదురు? మాద్రవతము భంగముగాదా? ఇదిగాక నీవుమరణించుటకు నేనెంతమాత్ర మంగీకరింపను.

పర—ఎందుచేత?

గుణ—ఇంతచక్కనిదేవుఁడు కన్నులపండువుగాఁ జూచుటకు మఱి యొకఁడు లభించునా? అదేమోకాని నిన్నుఁజూచినకొలంది నాకెంతయో సంతోషము గలుగుచున్నది. కాని, కాని, దేవుఁడా! నిన్నుఁజూడ నాకొక సందేహము కలుగుచున్నది. అడిగినచోఁ గోపపడవుగదా?

పర—నీవెక్కడ కోపపడెదవోయని భయపడుటయేగాని నీవిూఁదఁ గోపపడుటగూడనా?

గుణ—చూడు! నీకుఁ దల్లిదండ్రులు లేరనుకొందును.

పర—లేరు. నీవెట్లుగ్రహించితివి.

గుణ—నీకుఁ దల్లిదండ్రులు లేరుగనుకనే భయభక్తులు లేవు. భయభక్తులు లేవుగనుకనే యింత మంకుతనము. తల్లిదండ్రులు మాత్రమేనా భార్యగూడలేదా?

పర—ఏమీ?

గుణ—నీకు భార్యయేయున్నయెడల నీతలవెంట్రుకలనిట్లు జడలు గట్టనిచ్చునా? నున్నగాదువ్వి ముడివేయదా? మఱి నీయొడలంతయు బూడిదఁబూసికొన్నట్లు దుమ్ముగొట్టుకొని యుండఁగా నూరకుండునా? నలుగువెట్టి స్నానముసేయింపదా?

పర—నాభార్యకు నేనిట్లుండుటయే యిష్టము.

గుణ—అబ్బ! అంతకఠినురాలా! రాతికడుపునఁ బుట్టినదాయేమి? ఇట్టిదానితో నెట్లు గాఁపురముసేయుచుంటివి. మఱియొక వధువును బెండ్లియాడకపోయితివా!

పర—నాకింకొక భార్యగూడనున్నది. కాని యదియిప్పుడు నాతోఁ గాఁపురముసేయుటలేదు.

గుణ—ఎందుచేత?

వర—గీ. నన్నుఁ దనమదిలోఁ దాల్చి నాశిరమునఁ
దాల్పఁబడెడు నాగుణవతి దాను నేఁడు
అచలకన్యాశాపమున మర్త్యత్వమంది
భూమిఁబుట్టినిల్లుఁ బవిత్రమునుఁ బొనర్చు.

గుణ—ఏమో నీమాటలకన్నిటికి నాకర్థము తెలియలేదుగాని యామె పుట్టినింటనున్నదని మాత్రము తెలిసినది. నీయింట నున్నప్పు డామెయైన నీతలదువ్వునా? నిన్ను స్నానమాడించునా?

వర—ఈయిల్లాలు చంకనెత్తికొనిన సంతోషించునుగాని, ఆయిల్లాలు నెత్తినెక్కించుకొనినఁగాని సంతోషింపదు.

గుణ—సరి. నీయదృష్టము వల్ల కాఁటి కాఁపురము లాగుననేయున్నది. వారిమాటపోనిమ్ము దేవుఁడా! నీవు నాతోఁగూడ నిప్పుడుమా యింటికి రారాదా? నీకుఁదలయంటి నలుగుపెట్టి, నీళ్లుపోసి చక్కఁగాఁగురులుదువ్వి ముడివైచి పట్టుబట్టలు గట్టించి షడ్రసోపేతముగ భోజనము పెట్టి దక్షిణయిచ్చి పంపుదును. రా. రా.

వర—నేఁడు రాఁజాలను.

గుణ—ఏమిటనియున్నది. భక్తులొసఁగు పాలుపండ్లు నారగింపఁ బోవలయునా. నిజమే. మఱచితిని. పాపము. నీవారగింపరాక పోవుటచే వారెంతయిబ్బంది పడుచున్నారో! పో. దేవుఁడా. పో. పో. కాని, ఒకమాట. ఇదిగో! అబ్బాయీ! నీవింకమీఁద నెన్నఁడుగాని పాలుద్రావుటకు నన్నింత యిబ్బంది పెట్టిన మాత్రము బాగుగానుండదు.

వర—ఇబ్బంది పెట్టను. కాని నాకు క్షీరము సమర్పించునప్పుడు నీవొక్కదానవు చూచుచున్నమాత్రమున పాలుద్రాగెదను. ఇతరులున్నచోఁ ద్రావను.

గుణ—దృష్టిదోషము దగులునని భయపడుచుంటివా? నిజమే. ఎవరి కన్ను లెట్టివో? అట్టులేకానిమ్ము. ఇంక నేనుబోయెదను.

పర—మంచిది. (అంతర్ధానమగును)

గుణ—ఈతనిసంగతియంతయు యాత్రనుండి వచ్చినపిమ్మట మాతలి దండ్రుల కెఱింగింతునా? వలదు. వలదు. పాలుద్రావక నన్నేడ్పించినాఁడని నాజననీ జనకులకుఁ దెలిసినచో వారీ తనిపైఁ గోపించి దూషింపరా! దూషించినచో దేవుఁడు మొగముఁ జిన్నపుచ్చుకొనఁడా? దేవుని ముద్దుమొగము చిన్న వోయిన నేఁజూచి సహింపఁగలనా! కావున నీసంగతులేమియు వారికిఁ జెప్పను. (పాత్రముఁ దీసికొని నిష్క్రమించుచున్నది)

## తృతీయ రంగము.



ప్రదేశము—శివశర్మ గృహము.

ప్రవేశము—శివశర్మ—సర్వమంగళ.

శివ—దేవీ! సర్వమంగళా! కాలకంధరానుగ్రహమ్మునంజేసి కాశికా తీర్థమాడి కృతార్థులమైతిమి. కాని మనచిన్నిబిడ్డ గుణవతి మనవ్రతమెట్లు సేయుచున్నదో యనిమాత్రము నాహృదయము శంకించుచున్నది.

సర్వ—ప్రాణనాథా! మీకెందులకీ సందేహము? మనగుణవతి వివేక వతి. ఏమఱపాటన్న నెఱుఁగనిది. వ్రతనిర్వహణము సేయుట కేమి? మనమిప్పుడువచ్చువఱకామె యింటిలో నేలలేదో వేఱ చెప్పవలెనా?

శివ—ఆలయమునకు క్షీరము శివార్పణమొనర్పఁ బోయియుండును.

సర్వ—(ప్రక్కకుఁజూచి) అదిగో! అదిగో! మనముద్దుబిడ్డ మనయిరు వురిఁజూచి సంతోషముతో గంతులిడుచుఁ బరుగెత్తికొని వచ్చుచున్నది.

శివ—(అటుపరికించి) ఆఁ! ఆఁ! ఇదియేమి? క్షీరపాత్రముదలక్రిందుగాఁ బట్టుకొనివచ్చుచున్నది. పాలేవి?

(గుణవతి పరుగెత్తుకొనివచ్చి తల్లిని కౌఁగిలించుకొనుచుండఁగా శివశర్మ పాత్రము లాగికొనుచున్నాఁడు.)

శివ—ఇదియేమే నిర్భాగ్యురాలా? శూన్యపాత్రమేమే? పాలేమిసేసితివే? వ్రతమేమిసేసితివే! వంశనాశనమును జేసితివే?

చ. అలఁతిగ నెంచి యీశునకు నర్పణసేసినయట్టి క్షీరముల్
జెలులకుఁ ద్రావనిచ్చితివొ? సిగ్గత్రోవను నీవ మ్రింగితో?
పలువతమ్ములకు బుడమిఁ బాఱఁగఁ బోసితొ? యేమిసేసితో?
తెలుపవె! నిక్కమింతయును దేటగ నోకులనాశకారిణీ!

గుణ—నాయనా! ఎందుల కింతకోపము? నేను క్షీరము ద్రాగలేదు. చెలిమికత్తెల కీయలేదు. పాఱఁబోయనులేదు.

శివ—మఱిపాలకుఁ గాళ్లువచ్చి పరుగెత్తుకొనిపోయెనా? కాక, యేమయ్యెను?

గుణ—పరమేశ్వరార్పణమొనర్చితి.

శివ—పాలేమైనవి?

గుణ—తండ్రీ! మరల నడిగెదవేమి? పరమేశ్వరార్పణ మొనర్పఁబడిన పాలెట్లు తిరిగివచ్చును?

శివ—అనఁగ నేమైనవి?

గుణ—త్రావినాఁడుగదా?

శివ—ఏమి? పాలను బరమేశ్వరుఁడు త్రావినాఁడా? పాత్రము మ్రింగిన దన్నవెతివి! కొంతవఱకు నయమే! పాలుఁద్రావి పాత్రను విడిచిపెట్టినాఁడేమి? దానిఁగూడ మ్రింగలేక పోయినాఁడా? ఓసీ! జేనెడులేవు నరిగ బొంకుటయైన నెఱుంగవు. నన్ను మాయ సేయఁజూతువే? ఛీ! ఛీ! ఛీ!

గుణ—జనకా! నాపైనూరక కోపపడెదవేమి?

శివ—నిజమే. నీపైఁ గోపపడుట యన్యాయ్యము. పదియేఁడులైన రాని పసిపాపపైఁ గొండంత భారముమోపి నిర్విచారముగఁ దీర్థయాత్రకుఁబోవ సాహసించిన నామహాఖ్యము ననవలసినదే గాని నిన్ననవలసినదేమున్నది? హరహర! మహాదేవ! వ్రత నాశనము! వంశనాశనము! సర్వనాశనము!

సర్వ—ప్రాణనాథా! చింతింపకుఁడు.

శివ—ఒక్కటేచింత! వ్రతసమయ నిర్వాహణచింత! వహ్నికుండప్రవేశ చింత!

సర్వ—అటుకాదు. మనగుణవతి సత్యవతి.

శివ—ఏమే? సత్పుత్త్రికామాతృకా! నీతనయ సత్యవతియా? కావచ్చును. ఇంతకు నీయభిప్రాయమేమి? పాలు పరమేశ్వరుఁడు ద్రావినాఁడనుట,సత్యమనియే.

గుణ—నాయనా! సత్యము! ముమ్మాటికి సత్యము! దేవునితోడు.

శివ—ఛీ! ఛీ! ఇప్పుడుచేసిన పాపముచాలక శాశ్వతముగఁ గుంభీపాక నరకకూపమునఁ బడియుండుటకా ఘోరప్రమాణము సేయుచుంటివి? ఆహా! దేవునితోడు. దేవుఁడు పాలు గ్రోలినాఁడు. ఓయనృతభాషిణీ.

ఉ. దేవుఁడు పాలుగ్రోలెనని తెల్పెదవల్పునకట్లు, నీవపో
త్రావితి, నిందనీశుతలఁ దాఁపితి, నిన్నదనమ్మి నావ్రతం
బీవిధి నగ్గిలోనిడితి, నిస్సిరో! పిల్లిని పాలకుండకుఁ
గావలివెట్టిపోయినను గల్గెడులాభమదిట్టిదేకదా

గుణ—నాయన! నాపై నీకెందులకింత యవిశ్వాసము!

శివ—ఆడరాని యసత్యమునాడితివిగనుక.

గుణ—అసత్యముకాదు. తండ్రీ! సత్యము! నీవునమ్మయు నర్పించినప్పుడుమాత్రము దేవుఁడు దుగ్ధము త్రావలేదా? ఇప్పుడటులే త్రావినాఁడు! ఇందాశ్చర్యమేమున్నది?

శివ—చూచితివా! సత్యవతీ జనయిత్రీ! మనమర్పించినప్పుడు పరమేశ్వరుఁడు క్షీరమానినాఁడని యిదివిశ్వసించి తానర్పింపఁబోవఁ బరిగ్రహింపక పోవుటచే వ్రతభంగమైనదని మనము దెలిసికొందుమని యిది ప్రతిదినము పాలుదానుద్రావి వట్టిపాత్రముతోనింటికివచ్చి భగవంతుఁడు దుగ్ధము గ్రోలెనని చెప్పుచున్నది. గ్రహించితివా?

గుణ—ఏమమ్మా! మీరర్పించినప్పుడు పరమేశ్వరుఁడు పాలారగింపఁడా?

సర్వ—ఎప్పుడును లేదు.

గుణ—మఱి నేనర్పింపఁగ ద్రావుచున్నాఁడేమి?

శివ—నిశ్చలమగు నీభక్తికిమెచ్చి.

గుణ—అసత్యము కాదు. నాయనా! అసత్యముగాదు. పోనీ! రేపటి యుదయమున మీరుచూచుచుండఁగ భవునితోఁ బాలుద్రావించినచో విశ్వసింతురా?

శివ—మాకనులతోఁ జూచుచుండఁగనా?

గుణ—అవును.

శివ—నిజమా?

గుణ—ముమ్మాటికి.

శివ—శివుఁడు ద్రాగనిచో?

గుణ—వహ్నికుండప్రవేశము తప్పదుగదా?

శివ—తప్పదు. మాతోఁబాటు ముమ్మాటికిఁ దప్పదు. (అపవారించి) దేవీ! ఈబిడ్డ యింతగా నొక్కివక్కాణించుచున్నది. దీని మాటలలోఁ గల్లగాని కపటముగాని నాయల్పబుద్ధికి గోచరించుటలేదు. మఱియిట్టివిషయమా జరుగునదికాదు.

సర్వ—(అపవారించి) నాథా! పరమేశ్వరానుగ్రహము గలిగినచో నసంభవమేమి?

శివ—(అపవారించి) పరమేశ్వరానుగ్రహమా! మనవంటి నరకీటక ములమీఁదనా? అసంభవమసంభవము. ఇది దీనిమాయ. కానిచో మనశత్రువులమాయ. ఎవరిమాయయైనను మన వ్రతము భగ్నమందినట్లే. హరహర! మహాదేవ! మహాదేవ!

సర్వ—అమ్మా! గుణవతీ! పరమేశ్వరుఁడు ప్రత్యహమును బాలు ద్రావుచుండునా?

గుణ—నాకన్నులయెదుట. ఒకచుక్కయైనమిగులకుండ.

సర్వ—ఆతఁడెవ్వరివలెనుండును?

గుణ—ఎవ్వరివలెనుండఁడు. నేను పుట్టిబుద్ధియెఱిఁగినది మొదలతని వంటివాని నెందుఁజూచియుండలేదు.

సర్వ—ఆతని రూపరేఖావిలాసములెట్టివని వచింపలేవా?

గుణ—ఆమహానుభావుని రూపరేఖావిలాసముల సరిగావచించుటకు నాకేఁగాదు, నన్నుఁబుట్టించిన బ్రహ్మకైనఁ దరముగాదను కొందును. అయిననాచేత నైనంతవట్టు వచింతును. అవధ రింపుఁడు.

సీ. జేగుఱుజడలను నాగఁబాముననఁగట్టి
పూవచందురునందుఁ బొదిగినాఁడు
మువ్వన్నెపులితోలు మొలచుట్టునుంజుట్టి
యేనికతోలుపై నేసినాఁడు
పండువెన్నెలచాయ నిండారునెమ్మేన
వెలిబూదిఁ బొలుపార నలఁదినాఁడు
నీలిమబ్బునుబోలె నెగడునల్లనిమెడఁ
బునుకలపేరును బూనినాఁడు
గీ. మూఁడుకన్నులుగలవాఁడు, మూడఁజూడఁ
గనులపండువయగువాఁడు, కమ్మనైన

పలుకులెప్పుడుపలికెడు కే వాఁడు, పాలు
ద్రావువాఁడు, నీతోఁడు! మా కె తండ్రితోఁడు!

శివ—హరహర! మహాదేవ! మహాదేవ! దేవీ! దీనిమాటలఁబట్టి యాలోచింప నెవ్వఁడో యొకదుండగీఁడు మనవ్రతము జెఱచి మనవంశమును నిర్మూలింపఁ దలఁపూని యిట్టిమాయవేసము వేసికొని యీపసికూనను వంచించి ప్రతిదినము పాలుద్రావుచుఁ దనపొట్ట నింపుకొనుచున్నాఁడని తోఁచుచున్నది. ఎట్లైననేమి? వ్రతభంగమైనది. ప్రాయశ్చిత్తము తప్పదు. రేపటియుదయమున శంభుచరణ సాన్నిధ్యమున నగ్గిగుండముఁ ద్రవ్వించి కట్టెలు నింపించి యగ్గిరగుల్కొల్పి మనము ముగ్వురమందుఁ గూలి భస్మముగావలయును. ఒకవేళ నిజముగాఁ బరమేశ్వరుఁడు పాలుఁద్రావ సాక్షాత్కరించునా మనము తరింతుము. లేదా? వీరశైవవ్రతసమయ నిర్వాహణమునకుఁ బ్రాణము లర్పించి యిట్లునుదరింతుము. ఏమైన నిప్పుడు దుఃఖింపవలదు. ఉపవసించి పరమేశ్వర ధ్యానముతో నీదినము గడపుదము. రండు. (నిష్క్రమింతురు)

## తురీయరంగము.

### ప్రదేశము — శివాలయము.

(ప్రవేశము క్షీరపాత్రముఁ జేఁదాల్చి గుణవతి. వహ్నికుండమురగులఁ జేయుచు సర్వమంగళా శివశర్మలు.)

సర్వ—అమ్మా! గుణవతీ! పరమేశ్వరునిఁ బ్రార్థించి పాలుద్రావించి మమ్ముఁ దరింపఁ జేయుము.

శివ—తరింతుములెమ్ము. ఇదిగోఁ దరించుమార్గము!

గుణ—ఓపరమేశ్వర! పరమ కృపామధురా!

ఉ. పాలను నీవ త్రావితని ♦ పల్మరుఁజెప్పినఁ, దల్లిదండ్రులేఁ
గ్రోలితినంచుఁ జౌర్యమును ♦ గ్రూరత నామెడనంటఁగట్ట నీ
పాలికిఁ దోడితెచ్చితిని, ♦ వారలు గన్గొనినమ్మ క్షీరముం
గ్రోలవె! నాదు వైశసము ♦ గూల్పవె! నిల్పవె సత్యమీశ్వరా!

ఏమి? దేవుఁడా! రావేమి? పాలు త్రావవేమి? అయ్యయ్యో! ప్రతిదినము నేను క్షీరముగొని నీచరణ సన్నిధానమునకు వచ్చుటయే తడవుగ మొలకనవ్వు ముద్దుమొగమునఁ జిగురింప నవలనేత్రమునఁ గూడఁగరుణారసము చిందులువాఱఁ బరమానందముతో నత్యపర్వముగ సాక్షాత్కరించి తేతెమ్మని దుగ్ధపాత్రను లాగికొని యమృతరసముంబోలెఁ బాలనారగించు వాఁడవే! నేఁడేల రావు? నాపై నలుకవగొంచితివా? నేనేమి దోసము సేసితిని. ఓదయాళూ! ఆనాఁడు నిన్నిప్పుడునింక నిబ్బందిపెట్టనని నాకభయ హస్తమిచ్చితివే? అది యింతలో మఱచినావా? ఆ. నీవు కాదు. ఇతరులున్నఁ ద్రావనని నీచెప్పిన మాటనేనే మఱచి నీయెడఁ దప్పుసేసితిని. ఈశ్వరా! నాయపరాధము మన్నింపుము. అమ్మా! నాయనా! నేనొకతెందప్ప నితరులున్నఁ బాలుగ్రోలనని పరమేశ్వరుఁ డిదివఱకు నాతోఁ జెప్పియున్నాఁడు కావున మీరు కొంతసేపవ్వలనుండుఁడు. నేనీశ్వరుతో దుగ్ధము ద్రావింతును.

శివ—ఓసీ! రజ్జులాఁడీ! మేమవ్వలనున్న నీవుద్రమింగి పరమేశ్వరుఁడు క్షీరమానినాఁడని చెప్పి, మమ్ము మోసగించుటకా యీపన్నాగము పన్నితివి? చాలు. చాలు. నీయంతటి యీశ్వరభక్తులము కాము కాఁబోలు మేము? భక్తిశూన్యులమగు మా ప్రోల పాలుగ్రోల సంశయించును గాఁబోలు సర్వేశ్వరుఁడు! ఏమి! నీమాయమాటలు! నోరుమూసికొని వహ్నికుండ ప్రవేశమునకు సంసిద్ధురాలవుగమ్ము

గుణ—ఈశ్వరా! వినుచుంటివా! వినుచుంటివా! నాతండ్రిపలుకులు? నాతల్లిదండ్రులు నన్నువిశ్వసించుటకు, నన్ను రక్షించుటకు,

నను గతింపం జేసి నా పున్కం జేఁదాల్ప
బుద్ధిపుట్టె నెనీకుఁ బుణ్యమూర్తి!
నాదు కాటిం జేరి నవసాంధ్య తాండవం
బాడ వాంఛించితే యఖిలనాథ!

గీ. పాముసకుఁ బాలువోసిన భంగియయ్యె
నీకు నేఁ బాలువోయుట నీలకంఠ!
పాల్ద్రావి పాదుగుఁగోయఁ బాడిగాదు
రార! రక్షింపరా! ప్రోవరా! మహేశ!

శివ—ఓసీ! సర్వమంగళ! దీనికి భగవంతునకర్పింపవలసిన దుగ్ధము గుటుకుమని మ్రింగుటలోనున్నంత సాహసము, అసత్యకల్పనలు కల్పించుటలో నున్నంతసాహసమునలకుండ ప్రవేశము గావించుటకు లేకున్నది. మఱి పసికూనగదా? దీనిఁ గ్రిందఁబడ వేయుము. నీవు పాదములవంకను నేను శిరమువంకను బట్టుకొని దీని మున్ముందగ్నికుండమునఁ బడవేసి, పిమ్మట మన మిరువురము దుముకుదము. ఊఁ! కానీ. హరహర! మహాదేవ! మహాదేవ! (గుణవతిని క్రిందఁబడనెట్టుచున్నాఁడు)

గుణ—ఈశ్వర! ఈశ్వర! నిన్ను విషకంఠుని క్షీరకంఠుఁ గావించిన నీచరణకింకరి గనగన మనిమండు నీనిప్పుగుండమునఁ ద్రోయ బడి భస్మమగుచున్నది. ప్రభూ! ఓధర్మప్రభూ! నీకిదియే యిష్టమా? నేనకాదుసుమా! నాతోఁబాటు, నాతల్లిదండ్రులతోఁబాటు, నీసత్యసంస్థాపన పరాయణత్వము, నీధర్మరక్షణ ధురీణత్వము, నీయార్తజనావన బిరుదాంకము, నీప్రచండజ్వాలన కుండమునఁ నొక్కపెట్టునఁగూలి మలమలమాడి పెనుబూడిదయై రూపటిపోవుచున్నది. హరహర! మహాదేవ! మహాదేవ!

సర్వ } శివ } (చెఱియొకవంక గుణవతినిఁ బట్టుకొని) హరహర! మహాదేవ!

(ఎత్తిగుండమున వేయఁ బోవుచుండఁ బరమేశ్వరుఁడు సాక్షాత్కరించుచున్నాఁడు) శాంతింపుఁడు. శివభక్తులారా! శాంతింపుఁడు, మీరందఱు తరించితిరి.

సర్వ
శివ
గుణ } (పరమేశ్వరుని పాదములపైఁ బడుచున్నారు)

[అనుబంధము 7]

యవనికజాఱును.

ఇది చతుర్థాంకము.



# శివలీల.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము—వియత్పథము.

ప్రవేశము, గంగాదేవి.

గంగా—(ఆత్మగతము) అక్కటకట! విశ్వేశ్వర జటాజూట విరహవేదనానలమున మామక హృదయము దహించుకొని పోవుచున్నది. పార్వతీశాప ప్రకారము గుణవతినై మర్త్యత్వంబను భవించియుఁ గమ్మలి మదనాంతక శిఖావాసమునకు నోఁచుకొననైతి. కర్మఫల మెట్టివారికి ననుభవింపక తప్పునుగదా? ఆర్తజనపాలున కానారదగానలోలున కీకింకరిపై నెప్పుడు కరుణ గలుగునో?

(ప్రవేశము నారదుఁడు)

నార—లోకపావనీ! గంగాభవానీ! నమస్కారము.

గంగా—శుభముగుఁగాక.

నార—అమ్మా! క్షేమమా!

గంగా—నారదా! నాక్షేమము నీ వెఱుంగని దేమున్నది?

గీ. అచలకన్యకా ఘోరశా । పానిలమున
మదన మథన జటాలతా । మల్లికళిక
రాలి, విరహాతపమ్మునఁ । గూలి; యిదిగో
చచ్చి చావకయున్నది । జటికులేంద్ర!

నార — తల్లీ! చింతింపకుము. తిరుగ గౌరీనాథ జటాజూటావాసము నీకు లభింపఁగలదు.

గంగా — నారదా! అంత భాగ్య మీమదరదృష్టవంతురాలి కెట్లు లభ్యము గాఁగలదు?

నార — వియత్కల్లోలినీ!

గీ. తీవెనుండి గిల్లఁబడిన । పూవుతిరుగఁ
దీవ నెటుసేరునంచు సం । దేహపడకు
దైవఘటనకు నెందసా । ధ్యంబుగలదె?
అగ్నినీరుగాదే! నీర । మగ్నిగాదె?

నీలకంధరుఁడు నిజజటాజూటమునఁ జంద్రరేఖంబోలె నిన్న లంకరించుకొను విచిత్ర నాటకమునఁ బ్రధానపాత్రధారి భగీరథుండు నేఁడు నీకడకు రాగలఁడు.

గంగా — ఏమి? భగీరథుఁడా? ఆహా! ఆనాఁడిందుశేఖరుఁడు నాతో భగీరథుఁడను రాజన్యుని కారణంబున నీవు నాశిఖ నలంకరింపఁగలవని వచించియున్నాఁడు. నారదా! అతఁడే కాఁడా యీతఁడు?

నార — అవును. ఆభూలోకాధీశుఁడు నిర్జరులకుదుర్జయులగు దుష్టదైత్యుల వధించుటకు నమరవిభునిచే నాకమున కాహ్వానింపఁబడి వారినెల్ల సంగరమ్మునఁ జక్కాడి, పులస్త్య బ్రహ్మసంతాన హత్యాపాతకంబును దన్నారాచఖచిత నిజావయవ రుధిరమును నీజలంబులఁ గడిగివైవ నిన్వేఁడిచ్చుటకు వచ్చుచున్నాఁడు.

గంగ — ఆహా! నేఁడునేను పరమ పవిత్రనయ్యెదను.

గీ. అందఱుఁ బవిత్రులయ్యెద । రంటినన్ను,
నేఁబవిత్రనయ్యెద జగ । ద్ధితముకొఱకు

నరులనోర్చి తచ్ఛరఖచికెత్తాంగరక్త
మునుగడుగ నన్నుఁ జేరు వీకె రుధిస్పృశించి.

నార—అమ్మా! సురాపగాదేవీ! ఇట్లని సంతోషముతో నీవాతఁడు స్నానమాడ నంగీకరింపవలదుసుమా?

గంగ—ఏమి నారదా?

నార—అందులకు నీవంగీకరించినచో నింతలో నీకు శాపవిమోచనము గలుగనేరదు.

గంగ—ఎందుచేత?

నార—ఈశ్వరేచ్ఛ యట్లున్నది!

గంగ—ఎట్లున్నది?

నార—భగీరథుఁడు నీయందు స్నానమాడవచ్చినంతనే, ఛీ! ఛీ! పంకిలకర్మ! నన్ను స్పృశించి యపవిత్రంజేయకుమని నీవన వలయును.

గంగ—అయ్యో! పుణ్యమూర్తి యగు నాతని నేనట్లు నోనాడు టన్యాయముగాదా? అదిగాక యాతఁడు నేనెట్లు పంకిల కర్ముండనైతినో చెప్పుమని పృచ్ఛించిన నేమని ప్రత్యుత్తర మిత్తును?

నార—నీవు ప్రత్యుత్తరమీయ నక్కఱలేదు. అప్పటివఱకు నేఁజా టుననుండి సమయమునకతని కట్టెదుటఁబడి చెప్పవలసిన మాటలుసెప్పి నీశాపవిమోచనముఁ గావింప బ్రయత్నము సేసెద.

గంగ—మంచిది.

నార—వాఁడుగో! భగీరథుఁడు వచ్చుచున్నాఁడు. ఆతనికీరూపముతోఁ గనఁబడకుము.

గంగ—(విమర్శించుచున్నది)

నార—(చాటున నిల్చుచున్నాఁడు)

(భగీరథుఁడు ప్రవేశము.)

భగీ—(నదిలోనికి దిగుట కుద్యమించుచున్నాఁడు)

(నేపథ్యమున)

చీ! చీ! పంకిలకర్మా! పరమపావనినగు నన్ను స్పృశించి యపవిత్రం గావింపకుము

భగీ—నన్నిట్లు నోనాడి వారించువారెవ్వరు? నదీదేవతయా?

(నేపథ్యమున)

అవును.

భగీ—తల్లీ! ఇదియేమన్యాయము? నేను స్పృశించిన నీవపవిత్రవయ్యెదవా? అంతటిపాపము నేనేమిచేసితినమ్మా? ఓ స్వర్లోకకల్లోలినీ!

ఉ॥ జంకియొకింతగాఁ బందనయి శంకరభూముల శాత్రవాళికిన్
గొంకియొకింత నిచ్చుటకు ఙ్ఞానసురాళి కభీప్సితార్థముల్
బొంకియొకింత నెన్నఁడును బుట్టినగోలెను, లోకపావనీ!
పంకిలకర్మ! యంచు ననుఁ బల్కిన కారణమేమొ? చెప్పుమా!

ఓజగజ్జనయిత్రీ! మౌనము వహించితివేమి? తనయుఁడు సేసిన దోసమేమో వచించుట తల్లికి ధర్మముగాదా?

నార—భగీరథా! యేమి?

భగీ—స్వామీ! నమస్కారము.

నార—జయమగుఁగాక. అమరగంగా ప్రవాహంబున నఘమర్షణస్నానము సేయువచ్చితివా?

భగీ—నారదమహర్షి! అందులకేవచ్చితిఁ గాని నిరోధింపఁ బడితిని బాపకర్ముఁడ నగుట.

నార—నదీదేవత నిరోధించి యుండును.

భగీ—అవును. విరించిమనస్సంభవా! సర్వజ్ఞుండవగు నీకెఱుంగనిది లేదు. ఈపయున్నది తన్నుఁ జేరువన్ను "పంకిలకర్ముఁడా! ప

పుపావని నగునన్ను నీవంటి యపవిత్రం గావింపకుమని నిందిం చుటకుఁ గతంబేమి? నాచేసిన దోసమేమి?

చ. ఎఱిఁగిన నాఁటఁగోలె నది ౹ యేనొనరించి యెఱుంగ దోసముల్
జెఱుతలనాన నేదయినఁ ౹ జేసితినేమొ దోసం గవజ్ఞతన్
మఱిమఱి వేఁడికొందు విను ౹ మానివరేణ్యా! వచింపవయ్యా! చి
చ్ఛుఱికయునైన నాయఘము ౹ నోర్మిహరించి తరింతు నీకృపన్.

నార—భగీరథా! గంగాదేవి నిన్నట్లు నిందించుటకుఁ గారణమున్నది.

భగీ—మహాత్మా! ఉండవచ్చును. ఆజగన్మాత యూరకనన్ను నిందించునా? దాని నెఱుఁగఁజాలకుంటి. వచింపుఁడా కారణమును.

నార—వినియుందువుగదా నీపితామహ పితామహుండును మహామహుండును నిక్ష్వాకుకుల పయోనిధి హిమకరుండునగు సగరుని చరిత్రమును.

భగీ—వినియుంటిని. ఆయోధాగ్రేసరుఁడు హైహయాదుల నిర్జించి హయమేధము నొనర్చి భూరికీర్తిఁగన్నవాఁడు.

నార—ఆధరణీపాలుఁడు హయమేధ సవనదీక్షితుఁడై సత్రార్వంబును విడిచి దానిఁగావ షష్టి సహస్రసంఖ్యాకులగు నిజనందనులఁ బంచె, ఆతురంగము ప్రపంచమునఁ బరిభ్రమించుచు తోయహీనంబగు నర్ణవంబున నదృశ్యమయ్యె. పిమ్మట సగరనందనులు దానికై భూలోకంబంతయు వెదకివెదకి వేసారి పుడమిం దవ్విరసాతలముఁ బ్రవేశించి యచటఁ దపంబుసేయు కపిలమహర్షి సన్నిధానముననున్న సవనఘోటకమును గాంచి యజ్ఞాశ్వమును దొంగిలించిన చోరుండీ కపిలుండయని యాతనిపైఁ గవిసి కపిలకోపానలంబున బూడిదయైరి. సగరుఁ డిది యెఱింగి యజ్ఞాశ్వముగొనిరా తనమనుమని యసమంజస నందనుని నీపితామహునిఁబంపనతండరిగి కపిలమహామునీంద్రుని బ్రార్థించి హయముఁగొనివచ్చి పితామహకృత హయమేధ సమాప్తిం

గావించెను. పిమ్మట సగరుండంశుమంతుండను పౌత్రునందు భూభారము మోపి నాకము సేరె. అంశుమంతుండును గొంత కాలము మహీపాలనంబొనర్చి నిజనందనుని దిలీపుని రేనింగావించి తాగతించె. నీజనకుండు దిలీపుఁడు పితామహులకూర్ధ్వగతులుకల్పింపఁ బ్రయత్నించియు నిష్ఫలమనోరథుండై నీయందు వసుధాభారము నిలిపి సిద్ధింగాంచె, శక్తిచాలమి వారెవ్వరును సాగరులకు సద్గతులు కల్పింప నేరకపోయిరి. నీప్రపితామహుల కూర్ధ్వగతులఁగల్పించుటకు నీవు సమర్థుఁడవయ్యు మిన్నకుంటివి.

గీ॥ శక్తిగల్గియు యత్నంబు - సలుపఁడెవఁడు
పితలకుఁగా గతుల్ కల్పింపఁ - గుతలమందు.
వాఁడు పంకిల కర్ముండు - వాఁడు చెనఁటి
వాఁడు మానవాధముఁడు జీ - వచ్ఛవంబు.

భగీ—మహాత్మా! నాదోసమెఱింగించి నన్ను ధన్యుని గావించితిరి. నాప్రపితామహుల స్వర్గగతులంగావించుటకు నాచేయవలసిన ప్రయత్నముగూడ విశారతెలిపి నన్ననుగ్రహింపుఁడు.

నార—నీతండ్రియగు దిలీపుఁడు గావించిన ప్రయత్నమే!

భగీ—గంగావతరణ ప్రయత్నమా?

నార—అవును. పాతాళస్థంబగు నీప్రపితామహుల భస్మరాశిని గంగాప్రవాహంబునఁదడిపెదవేని వారికి సద్గతులు గలుగఁగలవు.

భగీ—మహానుభావా! నీయాజ్ఞను శిరసావహించు చుంటిని.

చ. హిమధరణీధరంబునకు - నేఁగెద, నుగ్రత నుగ్రుఁ గూర్చి యే
నమల తపంబుసేసి వర - మందెద నీమిను వాఁకఁ గ్రిందిలో
కమునను నస్మదీయ పితృ - కాండము భస్మముపైనిఁ బాఱ, నా
కమునకుఁ బంచెదన్ బితలఁ, - గాంచెద గంగ మునుంగ నర్హతన్
నాకు సెలవొసంగుఁడు.

నార—భగీరథా! సఫలీకృత మనోరథుఁడ వయ్యెదవు పొమ్ము.

భగీ—భాగ్యము. (నిష్క్రమించుచున్నాఁడు)

గంగా—(ప్రవేశించి) నారదా! నారదా! తుదకిట్లు సేసితివేమి? అర్ధేందు కిరీటు జటాజూటము నెక్కింతునని నన్నుఁ బాతాళమునకుఁ బంపు ప్రయత్నముగావింతువా? అయ్యయ్యో! ఇది యేమన్యాయ్యము?

నార—అమ్మా! భయపడకుము. వియత్పథమునుండి పరమేశ్వరాజ్ఞంజేసి నీవు క్రింది కవతరించునప్పుడు నీవేగమోర్చుటకు భూతలంబునకుఁగాని మఱియెవ్వరికిఁగాని సాధ్యముగాదు. విశ్వేశ్వరునకుమాత్రమే నీవేగమోర్వఁగలుగుశక్తి కలదు. దానంజేసి భగీరథుని సంపూర్ణమనోరథునిఁ గావింపఁ బరమేశ్వరుఁడు నిన్ను మొట్టమొదట నాకసమునుండి తనశిరమున నిలుపుకొని హిమవచ్ఛిఖరాగ్రమున విడువఁగలఁడు. అప్పుడు నీవు భగీరథునివెంటనంటి భరత ఖండమధ్యమార్గంబున సాగర భస్మరాసులున్న స్థలముంజేరి వారికింగతులంగల్పించి వారాశినిజలంబుల నింపి జగత్త్రయంబును పవిత్రంబు గావించుచు శివజటాజూటవాసినివగుటయేగాక త్రిలోకపావనివై వర్ధిల్లెదవు.

గంగా—నారదా! నీవు చేసిన మేలు మఱువఁ దగినది కాదు.

నార—అమ్మా! ఇందు నేను జేసినదేమి? సర్వమునకుఁ గర్త యీశ్వరుఁడు.

ఆ. వె. చెడుగుసేయ మేలు సేయ జీవులకును
దక్షుఁడొకఁడె సర్వ రక్షకుండు.
చెడుగుసేయ మేలు సేయుజీవులకును
నెంతవారు దలఁప నెంతవారు?

అమ్మా! నాకు సెలవొసంగెదవా!

గంగా—మంచిది. (నిష్క్రమించుచున్నారు)

## ద్వితీయ రంగము.

(హిమవత్పర్వతమునఁ దపమొనర్చుచు భగీరథుఁడు ప్రవేశించుచున్నాఁడు)

(వృషభవాహనారూఢులై పార్వతీ పరమేశ్వరులు ప్రవేశము)

పర—లెమ్ము! వత్సా! లెమ్ము! నీతపముఫలించినది.

భగీ—(కన్నులుదెఱచి చేతులుమోడ్చి)

మ. జయ కామాంతక! నీలకంఠ! వరదా! శైలేంద్రజాత్మేశ్వరా!
జయ చంద్రార్ధకిరీట! శంకర! జగత్స్వామీ! దయాంభోనిధీ!
జయ భక్తప్రతిబంధబంధనకళా చాతుర్య పారంగతా!
జయ దీనావన! లోకపావన! మహేశా! యీశ! మన్నింపవే!

చ. సలిలమునందు శైత్యమటు, చందురునందుఁ బ్రసాదముంబలెన్
జ్వలనునియందు దాహకత చందమునన్, బ్రసవంబునన్ బరీ
మళమును బోలె సర్వమున మానక నేఘనుఁ డంతరాత్ముఁడై
వెలసెను నాపరాత్పరుని విశ్వజగద్గురునిన్ భజించెదన్.

పర—వత్సా! నీయభీష్టము వేఁడుకొనుము.

భగీ—పరమేశ్వరా! నాప్రపితామహులు సాగరు లర్వదివేలమంది కపిలజటిలేంద్ర క్రోధానలంబునఁ బాతాళంబున భస్మమై గతులుగలుగక యున్నవారు. వారి భస్మరాసులపై గంగాభవానిం బ్రవహింపఁజేసిన వారుముక్తులయ్యెదరు. గంగాభవానినావెనువెంట వచ్చుటకు వరమనుగ్రహింపుఁడు.

పర—అనుగ్రహించితిని. ఆకసమునుండి క్రిందికి గంగ యవతరించునప్పుడు దానివేగమోర్వ నాకుఁదక్క నితరులకు వశముగాదు. ఇదిగో! సురాపగను మామక జటాజూటమునఁ దాల్తు నేనుధరింతును. గంగనాహ్వానింపుము. రాఁగలదు.

(భగీరథుఁడు అనుబంధము 8 ).

(గంగావతరణము. పరమేశ్వరుఁడు గంగాదేవిని జటాజూటమున ధరించుచున్నాఁడు)

పర—భగీరథా! మజ్జటాజూటమునుండి మందాకిని హిమవచ్ఛిఖరాగ్రమునఁబడి నీవెంట నరుదేరఁగలదు. సాగరబిలరిబు కడకుంగొని పోయి తద్భస్మరాసులపైఁ బ్రవహింపఁజేసి పరిపూర్ణ మనోరథుఁడవుగమ్ము. నీవలన భూలోకమునకుం గొనిపోఁబడుటచే నీనది భాగీరథియను నామమును వహింపఁగలదు. నీకింకను గావలసిన యభీష్టవరము లర్థింపుము.

భగీ—మహాత్మా! ఇట్లగుఁగాక.

సీ. వసుధోపకారక । వ్యాపారరతులకు
సహరహంబును జయం । బబ్బుఁగాక
అమరబృందములకు । నమృతంబునుంబోలె
సుమతులకున్ శుభం । బమరుఁగాక
అదినాది యిదినాద । టంచు నహంకృతి
నుర్విజనులుసెడ । కుండ్రుగాక
మగువల వంచింప । మాయవేసము వేయు
నీచులకుఁ గీడు । నెగడుఁగాక

గీ. భక్తులకు మేలెయొందును । ప్రబలుఁగాక
అఖిలజనములు పెద్దల । కమలగతుల
నెదవఁజేయు యత్నములు సే । యుదురుగాక
యెల్లరును నినునమ్మి త । రింత్రుగాక.

పర—తథాస్తు.

ఇది పంచమాంకము.

శివలీలా నాటకము సంపూర్ణము.



# అనుబంధములు.

## 1. అనుబంధము నారదుఁడు.

ప్రణవస్వరూప! భానుప్రతాప!
కనకాద్రిచాప! సత్యానులాప!
మనోజమథన! యనాదినిధన!
త్రిణయన! శివశివ! దేవాదిదేవా!
గౌరీ వర! హర! ఖండేందుధరా!
కనకాద్రిచాపా! సత్యానులాపా
ప్రణవస్వరూప! భానుప్రతాప!

## 2. అనుబంధము మన్మథుఁడు.

ఇదియె వేళయగుఁగా! మత్ప్రతాపం
బీశుపైఁ జూపఁగ సురలకరుణ-
సదలమగు నీశ్వరసన్నిధికిఁ
జనుటయన్న భయమరయ్యెడుఁగా-
మది నద రేటికి విధివిధానమెదో
యది జరుగక మెటుదప్పదుగా॥ ఇది॥

## 3. అనుబంధము బ్రహ్మాదులు.

సర్గాపసర్గఫలదని- సర్గ! విదళితమహాఘ
వర్గా! విలసితసన్మార్గ! భర్గా॥ సర్గా॥
నారహారశూలీ! యర్ధేందుమౌళీ!
పురహార! సురవరనుత! వరసుగు
ణాకర! గిరిశా! కపాలీ॥ సర్గా॥

## 4. అనుబంధము విఘ్ననాథుఁడు.

భోజనము, భోజనము
భోజనము సుఖభాజనము॥ భో॥

ఈజగమునఁగలవారలకెల్లను
నిదియేకద కష్టమునము-
ఏజనమేనియు నిది లేకుండిన
యిల బ్రదుకుట దుర్ఘటము॥ భోజ॥

5. అనుబంధము. సురాసురులు

జగదవనాధారా! గిరిశా!
సకలాగమనుత- శైలజానాథా-
గగనధికుర కారుణ్యవార్ధి॥ జగ॥
యోగిజనరంజనా! నాగవిభంజన!
భోగిభూషణ! పుణ్య (జన) పోషణ!
కంఠేకాల! కాలకాల! ॥జగ॥

6. అనుబంధము గుణవతి.

జయ! శంకర! శాశ్వత! సాధునుతా!
జయ! శైలసుతాపతీ! సత్యరతా!
జయ! సంతతపావన! చక్రధరా!
జయ! సర్వఫలప్రద! శత్రుహరా!

7. అనుబంధము శివశర్మ మొదలగువారు

గిరిశా! దేవా! దేవా!
సురనుతిపాత్ర! గిరిజాకళత్ర!
సర్వేశా! శశిధరణా!
సదమలరూప! విదళితపాప! దేవా- గిరిశ॥

8. అనుబంధము భగీరథుఁడు.

విశ్వలోకమాత- దేవీ!
అమలయశకరీ! అఘభయంకరీ
లోకపావనీ-భవానీ- గంగాభవానీ! దేవీ! విశ్వ॥
పురహారురాణి-సరసిజేక్షణీ
దురితవ్రాతమతంగహారీ! దేవీ- విశ్వ॥

# సాధ్వసాధు పత్త్రిక.

| తప్పు. | ఒప్పు. | పుట | పం. |
| --- | --- | --- | --- |
| అర్థాంగలక్ష్మి (అంతట సగమను నర్థమున) | అర్ధాంగలక్ష్మి. | 8 | 8 |
| తీయము. | బీయము | ,, | 4 |
| ప్రమధ [అంతట] | ప్రమథ | ,, | 25 |
| అర్ధించు ,, | అర్థించు | 4 | 28 |
| సర్మాత్మ | సర్వాత్మ | 6 | 18 |
| ననుబోటులు [అంతట] | ననుబోఁటులు | 7 | 2 |
| అర్ధమిదిగో! | అర్థమిదిగో! | ,, | ,, |
| మన్మధుఁడు (అంతట) | మన్మథుఁడు | ,, | 13 |
| శంభురూపమున తుహిన | శంభురూపమునఁ దుహిన | 8 | 12 |
| మిధునంబున (అంతట) | మిథునంబున | 8 | 14 |
| విథాత | విధాత | 9 | 28 |
| వాయుండరయుఁ నెట్లు? | వారుండలఁచు నెట్లు? | 12 | 18 |
| స్ధాణుఁడు | స్థాణుఁడు | ,, | 25 |
| తధాస్తు | తథాస్తు | 13 | 5 |
| పధము | పథము | ,, | 23 |
| పగమేశ్వరుఁడు | పరమేశ్వరుఁడు | 14 | 5 |
| పదార్ధము | పదార్థము | 17 | 20 |
| నారదుడు | నారదుఁడు | ,, | 14 |
| తొలగుమా | తొలంగుమా | 21 | 25 |
| గొణుగు ,, | గొణఁగు | 24 | 2 |
| మధనము ,, | మథనము | ,, | 4 |
| కా పురము ,, | కాఁపురము | ,, | 21 |
| సమర్ధుఁడు ,, | సమర్థుఁడు | 25 | 6 |
| చేపలు | చేఁపలు | ,, | 16 |
| మాటఁమోసి | మాటుమోసి | ,, | 25 |
| కాబోలు ,, | కాఁబోలు! | 26 | 1 |
| చతుర్ధ | చతుర్థ | 26 | 9 |
| సర్వత్వా | సర్వర్థార్వ | ,, | 18 |
| వేల్పుదొత్తుల | వేల్పుఁదొత్తుల | 27 | 13 |
| పాధోనిధి (అంతట) | పాథోనిధి | 28 | 7 |
| గ్రాగడు | గ్రాఁగడు | 28 | 10 |
| చీటుల్ | చీఁకటుల్ | ,, | 10 |
| గడలిబుట్టె | గడలిఁబుట్టె | ,, | 12 |

| | | | |
|---|---|---|---|
| లోకముల్క | లోకముల్క | ,, | 20 |
| పాలిటి | పాలిటి | 30 | 4 |
| తధ్యమిధ్యా | తథ్యమిథ్యా | 31 | 7 |
| పుటుక్కున | పుటుక్కునఁ | 35 | 11 |
| మలి కావలుత్ | మాలి కావలుల్ | 36 | 14 |
| భూవుదూపు | భూవుఁదూపు | 38 | 24 |
| అంపసెజ్జల వెంపఱలాడి | అంపసెజ్జలఁ బొరలాడి | 39 | 18 |
| నోచెదరా! | నోఁచెదరా! | 40 | 2 |
| అదిగో! కత్తి | అదిగోఁ! కత్తి | ,, | 19 |
| పాఱుఁబోతు (అంతట) | పాఱుఁబోఁతు | 42 | 9 |
| వీథి కా | వీధి కా | 44 | 15 |
| వరించనినుణ్ | వరించనునిణ్ | 45 | 26 |
| పర్వతమీఁది | పర్వతముమీఁది | 46 | 25 |
| మనోరధము | మనోరథము | 50 | 4 |
| తీర్ధయాత్ర (అంతట) | తీర్థయాత్ర | 52 | 11 |
| మఱుగంగ (అంతట) | మఱుఁగంగ | 54 | 2 |
| మీగడ (అంతట) | మీఁగడ | 54 | 20 |
| అతిధి | అతిథి | 55 | 4 |
| అఁపరాక | అపరాక | 55 | 18 |
| పోటు | అనుబంధము | 56 | 13 |
| నలుగు (అంతట) | నలుఁగు | 63 | 19 |
| అంతర్ధానము ( ,, ) | అంతర్ధానము | 65 | 8 |
| పలువతిమ్మ్రక్ | పలువతినమ్మ్రక్ | 66 | 7 |
| తాఁపిత్రి | తాపిత్రి | 67 | 27 |
| హా! | హా! యీశ్వరా! | 72 | 7 |
| పొదుగు | పొదుఁగు | 74 | 1 |
| మహాదెవ | మహాదేవ | 74 | 21 |
| ప్రధాన | ప్రధాన | 77 | 10 |
| కల్లోలిని | కల్లోలిని | 79 | 18 |
| వచింపుఁ డాకారణమును | ఆకారణమును వచింపుఁడు | 80 | 12 |
| ఊర్ధ్వ | ఊర్ధ్వ | 81 | 8 |
| పరమేశ్వరుఁడు | పరమేశ్వరుఁడు | 84 | 2 |